

ఆంధ్రవాణీ గ్రంథమాల

(ఆశా్రీ.)

దివాకర్ల సత్యనారాయణమూర్తి,

(అధ్యక్షుఁడు.)

గుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మ,

(సంపాదకుఁడు.)

దువ్వూరి వేంకటనారాయణ,

(కార్యదర్శి.)



రత్నపత్రికా -

# జయచంద్రీయము

గ్రంథకర్త

దివాకర్ల సత్యనారాయణ



పి. జె యస్. వి యస్. ముద్రణాలయమున

ముద్రించి ప్రచురింపబడియె.

విజయనగరం.

1923.

 [ వెల రు. 0—12—0.

# పీఠిక,



నామిత్రులు కొందఱు చరిత్రాత్మకదృశ్య ప్రబంధంబులనేకములున్నవనియు, స్వకపోలితనాటక రూపకంబులెన్నియో లేవని నెద్దియేనొక సమగ్రకథా ప్రదర్శనీయంబగు స్వకపోలిత దృశ్యము రచింపనగుననియు, కోరుటంజేసి నేనీయుద్యమమునకుంగడంగి నాల్గుగంటలకాలములోఁ బ్రదర్శనమునకు వీలుగనుండునట్లీ నాటకము న వ్రాసితిని, ఇయ్యది నాప్రథమ ప్రయత్నమగుటయేగాక మొదటి కూర్పగుట నిందచ్చటచ్చట గననగు లేఖకముద్రణాప్రమాద జనిత దోషంబులఁ దెలిపినచోఁ బునర్ముద్రణమున సవరణఁ జేసికొందునని గుణగ్రహణ పారీణులగు పాఠకమహాశయులకుఁ గృతజ్ఞుండనై మిక్కిలి వినయపూర్వకముగా నంజలి ఘటించి నింతటితో విరమించుచున్నవాఁడను.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,

గ్రంథకర్త.

# భూమిక.

ఈగ్రంథ మాలకియ్యది ప్రథమపుష్పము. దీనిని రచియించి నవారు మ॥ రా॥ శ్రీ దివాకర్ల సత్యనారాయణమూర్తిగారు. ఈతఁడు బాలకవి. ప్రాయమెంతో లేదు. ఈరత్నపుత్రికా జయచంద్రియ కథ వీరి స్వయంకల్పితము. కొందఱు మిత్రుల ప్రోత్సాహముచే నిద్దానిని వీరు రచించిరి. సరిగా నాల్గుగంటల కాలములోఁ బ్రదర్శించుట కనుకూలముగా నుండునట్లు వీరు దీనిజాగ్రత్తగా వ్రాసినట్లు వీరి పీఠికయె చెప్పుచున్నయది. ఈనాటకమును గొన్నినాటకసమాజములీవరకె గొన్నిసారెలు ప్రదర్శించినవి. కాలానుకూలముగా నుండునట్లు పద్యములు సులభశైలిలోనే యుంచిరి. వీరికాంధ్రభాష యన్న నింతంత యభిమానముకాదు. వీరికే కాదు వీరికుటుంబములోని యందఱకును స్వీయభాషపై నెంతో ప్రేమ. స్వభాషాభివృద్ధికై ఎంతటి శ్రమలకైనను బాటుపడఁ జూచెదరు. ఈగ్రంథమాలను నెలకొల్పిన వారువీరే. ఉద్యోగమిషను అన్యరాష్ట్రమునందున్నను దమభాషామతల్లినిగూర్చి యిట్లుగాసేవ జేయబూనిన వీరెంతయును శ్లాఘాపాత్రులు. వీరు తలపెట్టిన యీమహత్కార్యము దినదినాభివృద్ధిని వహించునుగాక !.

వీరి కవనము మృదువై నాతికఠినమై యొప్పుచుండును. వీరింకను మఱికొన్ని గ్రంథములు రచియించినారు. అవియును గొద్దిరోజులలో బ్రకటింపఁబడును. ఒక్క వీరిగ్రంథములనెగాక మహనీయులగు మఱికొందఱుకవుల గ్రంథములు నిందుఁ బ్రకటింపఁబడును. ఇందిఁకముందుఁ బ్రకటింపఁబడు గ్రంథములు మఱింతయుత్సాహకరములగు గ్రంథములై యుండును. నవలలు, నాటకములు, మహనీయుల చరిత్రలు, చక్కని ప్రబంధములు మొదలుగాఁగల గ్రంథములు ప్రకటింపఁ బడుచుండును. కావున భాషాభిమానులరగు నో యాంధ్రమహాజనులారా! దయవుంచి చందాదారులుగాఁ జేరి గ్రంథమాల నభివృద్ధిలోనికిఁ దెసికొనిరాగల భారమునంతయును దమపైనె వైచి యింతటితో విరమించు

ఆడ్రా,
29—10—23.

భవద్విధేయుడు,
సంపాదకుడు.

# ఇందు వచ్చు పాత్రలు.



## పురుషులు.

సూత్రధారుఁడు.
చంద్రశేఖరుఁడు:— చందనాపురీశ్వరుఁడు.
జయచంద్రుఁడు:— కథానాయకుఁడు.
సుశీలుఁడు:— చంద్రశేఖరుని మంత్రి.
నారదుఁడు:— దేవర్షి.
ముకుందుఁడు:— జయచంద్రుని మిత్రుఁడు.
విజయసేనుఁడు:— మాళవదేశాధీశ్వరుఁడు.
భీషణుఁడు:— విజయసేనుని మంత్రి.
దుర్ముఖుఁడు:— విజయసేనుని సంగడీఁడు.
మదనుఁడు:— కళ్యాణపురాధిపతి తనయుఁడు.

## స్త్రీలు.

నటి
చంద్రవదన:— కథానాయకుని తల్లి.
రత్నపుత్రిక:— కథానాయకి.
పుష్పావతి }
లీలావతి } రత్నపుత్రిక చెలికత్తెలు.

ఇంకను సేవకులు, విదూషకుఁడు మున్నగువారు.

శ్రీ రామచంద్రాయనమః

# రత్నపుత్రికా జయచంద్రీయము.

## నాటకము.

### నాంది.

శ్రీలావణ్యవతిన్మహా గుణమణిన్ • శ్రీరుక్మిణిన్గూడు మున్
లీలాకేళిగృహంబుఁ జేరి రతికే • ళిన్దేల్పుచున్ దేలుచున్
హాళిన్మీరిన గోపికాజనమనో • వాంఛాదులన్గూర్చుగో
పాలుండాశ్రిత వత్సలుండొసఁగు స • ద్భావంబు సభ్యాళికిన్॥

(నాంద్యంతమున)

సూత్ర:— (ప్రవేశించి తెరవంకఁ జూచి) మృదుగాయనీ! మృదుగా
యనీ! ఇంకను జాలపరచెదవా. కాలవిలంబనము సేయఁజాల
యీసభికవర్యుల దయ సంపాదించుకొనుట యెట్లగు. (సభ్యు
లఁదిలకించి తనలో) ఆఁహా! నేడు బహుసుదినము. దండికపు
లంబోలు పండితోద్దండులచే నిండియుండు నీసభామండపము
ననుంగొన నాడెందమమందానంద మొందుచున్నది. అయిన
వీరియుల్లంబులుల్లసిల్లం జేయఁగలుగుదునా యను సందియము
మాత్రమించుకంత నాస్వాంతమున లేకపోలేదు. ఈపాటికి
నటివచ్చుచునేయుండును.

నటీ:— (ప్రవేశించి) ఆర్యపుత్రా! కోపపడకుఁడిదే భవదాజ్ఞానువర్తినినై వచ్చియున్నదాన. కర్తవ్యమాజ్ఞాపింపుఁడు.

ఉ. విదితయశోవిశేషులు, వి • వేకధనుల్మతిమంతులార్యులున్
సదయ మనోంబుజాతులును • సారసమేతకవిత్వ వేద్యులున్
మదినలరాముసందిడెడి • మానవవర్యులునైన యీసభా
సదులురు మోదమందఁగనఁ • జాలినదానవు నీవుగావునన్॥

నటి:— (ఆర్యా! ఏకసక్కములకానన్ను రానియమించితిరి. అట్లయిన నిప్పట్టునఁబోయెద. (అనిపోఁబోవును.)

సూత్రి:— (అడ్డుకొని) సుందరీ! ఏమినీతొందర. ఎద్దియేనొక సుందరనాటక మీరంగస్థలంబునఁ బ్రదర్శించి సభికవర్యుల నానందాబ్ధి నోలలాడింప నీవ సమర్థురాలవని రానియమించితిని. విదితమైనదా?

నటి:— ప్రదర్శనార్హంబగు నాటకంబెద్దియో?

సూత్రి:— ఏమి! తెలియనేతెలియదా? రత్నపుత్రికా జయచంద్రీయమని.

నటి:— రత్నపుత్రికా జయచంద్రీయమా? ఆర్యా! గ్రంథకర్తయో?

సూత్రి:— సఖీ! నామధేయములతో నవసరమేమి. నీవడిగితివి గాన నుడివెదవినుము.

చ. లలికటాక్షాభిదానపుర • లక్ష్మీసోదరులై చెలంగుచున్
లలితపదార్థభావముల • లాలనమొందిన జోగపార్యసూ
నులయుగసంఖ్యనొందిసుగు • ణుండును సర్వసహామరేడ్వ్యడ
త్యలఘుఁడు, సాధ్వసూనసరస • పూరంపుకబుత్రుఁడుస్తోత్రపాత్రుఁడున్॥

వెంకయు,

ఉ. ప్రియముఁబట్టి గన్గొనఁగ • బాలుఁడు ప్రౌఢుఁడుగాడు మాగ్ధ్యముల్
న్బాయని యట్టివాఁడుఁనుఁడి • వాకర''వంశభవుండు సత్యనా
రాయణమూర్తి నాముఁడిది • వ్రాసెను జెల్వుగ రత్నపుత్రికా
ఖ్యాయతమైన నాటకము • నౌనన సభ్యులు మెచ్చనాడనా॥

నటి— తెలిసినది. తెలిసినది. ఈనభాసములియ్యది వినఁదగినదై
కనఁదగినదై యున్నందున నియ్యదియే ప్రదర్శింతము.

సూత్రి:— నటీ! నీవన్నటుల నీనాటకముననే ప్రదర్శింతము.
మునుముందు మృదుమధుర కోకిలస్వరంబున నొకగానము
గానిమ్ము.

నటి:— ఏఋతువు ననుసరించి?

సూత్రి:— సర్వజనాను రంజితంబగు వసంతఋతువనుసరించి,

నటి:— చిత్తము.

లయగ్రాహి.

రంగయియహాస్సులు బె • డంగయి దనర్పగభు
జంగములుగాలికి నొ • రంగములువీడన్
భృంగపికకీరముల • సంగతిజెలంగు వన
రంగమునఁ దెమ్మెరల • సంగశరరాజ
భృంగములు వొడియుఁ చు • రంగములుగూడి బహి
రంగమున వింతగను • జెంగునను దాటన్
బంగరుహసింపఁగల • రంగయిన పూవులును
రంగనయనాత్ములను • బొంగిలిఁగ జేయన్॥

సూత్రి:— ప్రియసీ! లెస్సగాబాడితివి. నీగానమున కాఁగానవి
ద్యా విశారదుఁడగు నారద మునీంద్రుఁడును సరిరాఁడయ్యె
(అని ఒకవైపుచూచి) అదిగో! అటు కనుగొనుము. తన్ను
గొనుము.

తే. గీ. చంద్రశేఖరభూపతి ♦ సచివవర్యుఁ
డగు సుశీలునితోనిట ♦ కరుదెంచు
చున్నవాఁడింక మనమిట ♦ నున్న కార్య
భంగమగుగాన రమ్ము ని ♦ వాసమునకు॥

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.





శ్రీరామచంద్రాయనమః.

# రత్నపుత్రికాజయచంద్రీయము.

## ప్రథమాంకము.



### 1 వ, రంగము.

(చంద్రశేఖరమహారాజు, మంత్రి, సుశీలుఁడు, గూర్చొనియుందురు.)

చంద్ర:— అమాత్యశేఖరా?

మ. మనరాష్ట్రంబునఁగల్గు భూసురవరుల్ ♦ మాన్యక్రియాసక్తులై
జనుచున్నారలె? క్షత్రియోత్తములు రా ♦ జ్యంబెప్పుడున్వీడకే
ఘనతేజంబున నేలుచుందురె? మహా ♦ కారుణ్యభావంబులన్
జనులన్జూచుచు నున్నవారలెగదా? ♦ సౌఖ్యంబులం జెందఁగ
న్వినయస్వార్జితవృత్తినొప్పుచు వణి ♦ గ్బృందంబులున్నారలే?||

సుశీ:— క్ష్మాపాలచూడామణీ! భవత్పాలనంబునఁ బ్రజల కిసుమంతయైనను గొఱంతకలుగునే.

కం. మనరాష్ట్రంబునఁ గల్గెడు
జనులెల్లరు సౌఖ్యపడుచు ♦ సఖ్యముతోడన్

వినయంబుగానఁ బలుచుచు
ఘనమొప్పఁగ నున్నవారు • కరుణాభరణా॥

మెండియు, నాలుగెగలవారును దమతమ నియమితకార్యంబుల యందాసక్తిమెండయి కడుజాగరూకతతో మెలఁగుచున్నవారలు.

చంద్ర:— మంత్రిపుంగవా! దేశము సుఖముగనున్నందులకు సంతసమొందవలసినదేగాని నాకంతకంత కంతరంగమున వంతబొడముచున్నది.

సుశీ:— రాజేంద్రా! కారణమేమైయుండునో?

చంద్ర:— వినుము,

ఉ. ఏటికికీర్తి, యీపుడమి • నేటికిభోగములందుచుంట యిం
కేటికి, బ్రాణముల్ నిలుపు • టేటికి సంతతిలేని యట్టినా
బోటిజనాధి నాథునకు • భూరిపరాక్రమ విక్రమంబు లిం
కేటికిఁదెల్పు మంత్రివర? • యేగెదనేనిదె నాకమున్గనన్॥

సుశీ:— పృథ్వీశ్వరా! గుందనెందులకు!

మత్త. చింతలెల్లను బాసిరాజ్యము • క్షేమమొప్ప జనాళికిన్
వింతవింతగ నేలసికగు • విశ్వమంతయు బోరునన్
చంద్ర-చింతలెట్టులఁ బాయనౌను • సుశీలదెల్పుము శీఘ్రమే
సంతసంబు మరెట్లుబొందుదు • స్తోత్రలంబున నేనికన్॥

ఇంతియెకాక "అపుత్రస్యగతిర్నాస్తి" యను పండితవాక్యము వినియుండలేదా! సంతానము వడయనివారికి గతిలేదనుమాట వినలేదా! గనలేదా!! మెండియు సన్యాసులు మొదలగువారు మద్గృహంబున భోజనాదులందెదగన్నదియు నున్నదే. అష్టయిశ్వ

ర్గంబులు, దేవేంద్రపదవియును సంతానముతో పరియగునా. వెండి యు "సుపుత్రః కులదీపకః" అని విబుధులు వక్కాణించియున్నారు. ఓయీ! సచివవరా! ఇహలోకమందుండి జననిందితుం డనగుటకన్నఁ బరలోకమందుండి యనిందితుఁడనయ్యెద.

సుశీ:— రాజన్యచూడామణీ! తమరు వక్కాణించినదంతయు నిక్కువమేగాని "లలాటలిఖితారేఖా పరిమార్జున్ నశక్యతే" యని యిదివరకే విశదము.

తే. గీ. తలనువ్రాసిన వ్రాతను • దప్పజేయ
ధాతకైనను శక్యమే • ధరణియందు
మదినిగుందంగ ఫలమేమి • మానుమయ్య
చంద్రశేఖరభూపాల! • సత్యశీల॥

మఱియుఁ బండితాగ్రగణ్యు "అవశ్యమను భోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్" అనెడి పండితవాక్యంబు మనకుఁ దెలిపినవంగతియే. అనఁగా సమయాసమయములయందు సంభవించు సుఖదుఃఖంబులఁ దప్పక ననుభవింపవలయుననికదా తెలియవలయును.

దౌవా:— (ప్రవేశించి) చంద్రశేఖరమహారాజా! జోహారు! జోహారు!!

సుశీ:— ఓరీ! ఏమిరా ద్వారమునఁగల విశేషములు?

దౌవా:— మహాప్రభూ! జనపనారవలె తెల్లని గడ్డంబును, మఱ్ఱియూడవలె నఖసిఖపర్యంతము వ్రేలాడు జడలును, తెడ్డువలె తంబురయును గల యొకబైరాగివచ్చి తనరాక దేవరవారికి దెలుప నన్నుఁబంపెను.

సుశీ:— ఓరీ! సత్వరంబాతని మిక్కిలి వినయపూర్వకమ్ముగా లోనికిందోడ్కొనిరమ్ము.

దౌవా:— చిత్తము. మహాప్రభూ. (నిష్క్రమించి మఱల నారదునితోఁ బ్రవేశించును.)

నార:— క. నారాయణ నారాయణ!
నారాయణ కావుమయ్య ♦ నందకుమారా
నారాయణ దామోదర
శ్రీరాధాకృష్ణఁగొల్తు ♦ జిత్తమునందున్॥

చంద్రి:— (గద్దియడిగ్గి) మునికులతిలకా! నమస్కారంబు లాచరించుచున్నాను. (నమస్కరము చేయును.)

సుశీ:— మహాత్మా! మదీయ వందనములందుకొనుఁడు. (అని వందనము చేయును.)

నార:— మీకిరువురకు మంగళము లగు గాక!

చంద్రి:— మహాత్మా! ఈయుచితాసన మలంకరింపుడు. (ఆసనము చూపును.)

నార:— (నారదుఁడు కూర్చొని) రాజా! నీవును గూర్చుండుము.

చంద్రి— (కూర్చొని)

చ. మునివర! మోదపూర్ణహృదయ! ♦ పూర్వభవంబున నెట్టిపుణ్యమే
నొనరించినానొ, మీపదప ♦ యోరుహముల్ గనుగొంటినింక నా
మనమున నున్న కోరికల ♦ మానవసాధ్యములైనఁబొందఁగా
ననువులభించె మతుకలము ♦ నందెను ధన్యత సత్కృపానిధీ॥

నార:— రాజా! నీవాంఛితం బెద్దియో నేనెఱింగితిని.

చంద్రి:— దేవా! సర్వంబు నెఱుంగు మీబోటివారికిది యొక వింతయా?

సుశీ:— మునికులశేఖరా! మాబోటివారికిఁ దమవంటి భూసురవర్యుల దర్శనమే కడుకష్టము. నేడు మిమ్ము గన్నంతనే డెం

దము నం బొందుపరుపఁబడిన సందియంబులెల్లయు నివర్తిత మయ్యె. దేవా! సత్యశీలుండును, రాజాధిరాజబిరుదాంకితుండును, సుజనులకిష్టుండును, దుర్జనులకు గష్టుండును, జందనాపురీపాలుండును నగుమాచంద్రశేఖర మహారాజుగారివంతలనివర్తింపఁ గటాక్షించి యానందాబ్ధినోలలాడింపుఁడు. క

నార:— ఓయీ! మంత్రిపుంగవా దివ్యదృష్టింగనుంగొనఁ దప్ప మీయేలిక కోరిక లీడేరునని కన్పట్టుచున్నది.

సుశీ:—మునీశ్వరా! తమ యనుగ్రహమున్నచోఁ గోరిక లీడేరుట కు గొఅంతయేమి? ఇంతియెగాక తాముతలంచిన కార్యములీడేరకుండునా?

చంద్ర:— తాపసోత్తమా! ఇన్నినాళ్లకు నాజన్మము సాఫల్యము నొందెను.

నార:— రాజోత్తమా! నీకొక హితవృగఱపెదఁగాని కడునిదుమలము నుంగనొనను సందియము చే నింతదనుక నూరకుంటిని.

చంద్ర:— దేవా! మీపదపంకజములు నాహృదయమున సన్నివసించి యున్నంతకాలము నాయిడుమలు కడతేరకుండునా.

నార;— వేరొక సందియము గలదు.

చంద్ర:— దేవా! అదెద్దియో సెలవీయ వేడెద.

నార:— నీవొనర్పుకార్య మేరికిని తెలియఁబరుపక నీవొంటరిగా నమకూర్పవగును.

చంద్ర:— భవదాజ్ఞాను సారముగాఁ జేయ నుద్యక్తుఁడ నై యున్నాఁడను.

నార:— అట్లయిన సావధానచిత్తుండవై యూకర్ణింపుము. భవదీయపురంబున నుత్తరభాగంబునందొక విపినంబుగలదు. నీవాకాననంబున కరిగి నలుదెసలఁ బరీక్షించు నవసరంబున నీ నయనంబులకొక శిలోచ్చయము గానఁబడును. నీవద్దానిఁ జేరి మూఁడహోరాత్రంబు లచ్చటనుండి మూఁడవదివసంబు నీవాశిలోచ్చయాగ్ర భాగంబునకుంజని యుండుము. నా

టిదినము సూర్యోదయారంభమున నొక్కటియే ఫలముగల ర
సాలసాల మొకటి కానంబడును. తదుపరి నాయామ్రఫ
లంబును గోసి యర్ధాంగికి దిననిత్తువేని దప్పక నీకొక భాను
సమానుండగు బాలుండుదయించును. కాని కోయునపుడు,
తెచ్చునపుడు, భార్యకొసగునపుడు, నీవుతప్ప నితరులు చూ
డఁగూడదు. వెండియు నటవీస్థలముగాంచిన తోడనే నీకు
భీతి జనింపఁగలదు. ధైర్యమువీడక, భీతిలకుండ నీకార్య
మొనర్చుకొనుము. తప్పక సమకూరును.

చంద్రి:— మునీంద్రచంద్రమా! తమ రానతిచ్చినరీతిని కడుజాగరూ
కతోఁ బ్రవర్తించెద. తమరు నాయెడల గరుణనుజూపి
మదీయవంశ మభివృద్ధినంద జేసినందులకుఁ బ్రత్యుపకారం బొ
నర్పఁజాలనైతిఁ గదాయని నాడెందమున మిగుల గుందుచు
న్నాడను.

నార:— రాజేంద్రా! స్రుక్కఁబోకుము. సుఖముండుము. నేఁ
బోయి వచ్చెద.

చంద్రి:— మహాత్మా! చిత్తము. ఈనన్నుదాము కరుణించుడు.

సుశీ:— మునిశ్రేష్ఠా! నే సెలవుఁ గైకొనియెదను.

నార:— చంద్రశేఖర సుశీలులారా! మీరిరువురు సుఖముగానుం
డుఁడు. (నిష్క్రమించును.)

చంద్రి:— మంత్రీ! మనముపోయి వచ్చెదము.

సుశీ:— చిత్తము.

(ఇరువురునిష్క్రమింతురు.)

(అవనికజారును.)

——

ప్రదేశము — సౌధాంతఃపురము.

## ద్వితీయరంగము.

( చంద్రశేఖరుఁడు, చంద్రవదన ప్రవేశింతురు. )



చంద్ర— మనోహరీ! నేఁడు కడుసుదినము.

చంద్రవ— మనోహరా! కతమెయ్యది?

చంద్ర— మోహనాంగీ! అత్యంతంబగు సంతోషవార్త నేఁడు నా వీనులఁబడుటయే కారణము.

చంద్రవ— మోహనాంగా! అట్లు హర్షాంబుధి నోలలాడించిన మహనీయు లెవ్వరు?

చంద్ర:— గాన విద్యావిశారదుండును, దేవతా మునిచంద్రుండును నగు నారదమునీశ్వరులు విచ్చేసి:—

చంద్రవ:— విచ్చేసి యేమని సెలవిచ్చిరి?

చంద్ర:— కాంతామణీ! పుత్రసంతతి గలుగునని.

చంద్రవ— (మందహాసవదనయై) జీవితేశ్వరా! సంతతికలుగునని యా వక్కాణించిరి. (ఆత్మగతంబున) ఏమి యీసుదినము జననమాదిగ నిదివరకును డెందముగుంటుచుండ. నేటి కిఁగదా నాహృదయపద్మము వికసింపఁజొచ్చె. ఓ దేవకీవసు దేవనందనా! ఓ నరకాసురభంజనా! నేటికిఁగదా ధన్యురాలినిగాఁ జేసితివి. (నాథునివంకఁదిరిగి) మనోహరా! పిమ్మట నేమిజరిగె?

చద్ర:— జీవితేశ్వరీ! కాననసీమకుఁజని మూఁడహోరాత్రములచ్చట కాలముఁగడిపి మూఁడవదినంబున సూర్యోదయారంభమున నొక రసాలసాల మగుపడునని యు, దానినొక్కటియే ఫలముంచునని యు సద్దానిఁగొనివచ్చి నీకొసంగుమనియు, సెలవిచ్చె.

చంద్రివ:— మనోహరా! అట్లయినఁ గాననంబున కరుగనియ్యకొంటిరిగదా?

చంద్రి:— నందియా మందనేల?

చంద్రివ:— భూరమణా! ఇప్పుడే జననుద్యుక్తులై యున్నట్లు గానబడుచుంటిరే.

చంద్రి:— అవును.

చంద్రివ:—(విచారముఖియై పాదాంగుళితో నేలవ్రాయుచుండును.)

చంద్రి:— మనోనాయికీ! విచారగ్రస్తవై యుంటకుఁ గతంబేద్ది?

చంద్రివ:— సుందరాంగా! తెలియఁబలికితినేని దావాగ్రిహామందుదురేమో యని యూరకుంటిని.

చంద్రి:— సుందరీ! నందియమందక డెందంబునంగల సందియంబెద్దియో వడినుడువుము.

చంద్రివ:— ధారుణీశా! మిమ్ముల విడనాడి నేనొంటినై యుంటమునంబియ్యకొనద మ్మ్య. మీ వెంట నంటనవ కట్టితిని.

చంద్రి:— సతీతిలకమా! ఘోరకాననాంతరమున కింతులుఁ రాఁబడికాదు.

చంద్రివ:— ప్రాణేశ్వరా! సుందరీమణు లెంపువలన నటవీస్థలిఁ జేరరాదు.

విదూ:— (ఆత్మగతంబున) ఆమె సుందరీమణియఁట. గడసుందరమె సుందరమూర్తులా. ఏమీ! యీయందము. నాయాపును మించియున్నదా?

చంద్రి:— దేవి! వినుము.

మ॥ హరులున్ వ్యాఘ్రతురంగజంబుకకురంగాదుల్ కపుల్ శారికల్
తరులున్ గగనశల్యభల్లుకములున్ గాత్రమ్మును వ్యాపనమున్
ఘోరంబు ల్ద్రిగాఁపు సర్పవాలలో జంబాళ్ళ బింబాసనా!
యా మహారణ సమస్తంబుఁ బాడియగునే పాహి! పాహి!! జనుల్ సవ్వరే॥

చంద్రవతి:— నాథా! నారదమునీంద్రుం డానతిచ్చిన వాక్యముల
నృతములుకాకపోయినను మిమ్ము విడనాడి నేనొంటరిగనుండు
టకు స్వాంతమునం జింతయగుచున్నది. అడవులుండనిండు.
వ్యాఘ్రసింహాదివనేచరాదుల కొక్కింతయు జడియను. కావు
న మీాయండనుండ ననుజ్ఞ నీయఁగోరెద.

చంద్ర:— దేవీ! నీసమంజసవాక్యపుంజంబుల కమందానందమ
య్యె. అబలవుకదా. మృగసంతతిని గాంచినంతనే హృ
దయ మదురకుండునా.

చంద్రవ:— భూవరా! సందియమంద నెందులకు. నేనించుకంతయు
జడియుదాననుగాను. సుక్షత్రివంశంబున నుదయించిన నా
కు భీతియగునా. గాన నాముద్దుఁ జెల్లింపుఁడు.

చంద్ర:— సుదతీ! నీవు నారీరత్నమవయ్యు, నేనుడివినచందంబున
స్థైర్య విక్రమాది గరిమంబులకే నెంతయు సంతసమందితి.
గాని వేరొకసందియముఁగలదు.

చంద్రవ:— వసుంధరాధిపా! వినదగునేని, అదేదియో సెలవిం
డు. ఆలకింపఁ జిత్తము తత్తరపడుచున్నది.

చంద్ర:— మనోహారీ! నేనాయామ్రఫలము గొనివచ్చుతఱిగాని,
దెచ్చుటకేగు నవసరంబునఁగాని, కోయునప్పుడుగాని పరు
లెవరును జూడఁగూడదు.

చంద్రవ:— ప్రాణనాథా! మీాకు, తుష్టికరమైనఁజాలు.

చంద్ర:— మనోనాయకీ! సుకరంబులేదు. నేనిఁక దడవుసే
యరాదు. మూాడుదినంబులలో మరలివచ్చెద.

చంద్రవ:— చిత్తము. మీారాక కెదురుచూచుచుండెద.

చంద్ర:— రమ్ము పోవుదము.

( నిష్క్రమింతురు. )
( అవనిక వ్రాలును. )

ప్రదేశము — అరణ్యమార్గము.

# తృతీయరంగము.

ప్రవేశము — కొందరుభిల్లులు.



ప్ర. భిల్లు:— ఓరీ ! ఎంకన్నా ఏటిరోయ్ యీయడవి సాలాసిత్రం గావుంది.

ద్వి. భిల్లు:— అవున్ రోయ్. దానికేటిగాని, యీతపానకం సెల్లున్నాయంటార్రి.

తృ. భిల్లు:— సాలావున్నాయ్. రా. నాతోరా.

ప్ర. భిల్లు:— ఓరీ ! ఎంకన్నా ! ఈతపానకమంటే పడిసస్తావేటార్రి.

ద్వి. భిల్లు:— ఓరిపిచ్చోడా ! దానిమజా నీకేంతెలుసునురా. దొరలేలాగు రాగాగో చూడలేదంటార్రి ! దానిరుసిదానిదే.

తృ. భిల్లు:— ఓరిపిచ్చోడా ! సదువుకొన్నందుకు ఫలంరా. సూడు మీా మెలాసెప్తాడో.

ప్ర. భిల్లు:— ఓరీ! మనపోలిగాడికి తాటిపానకమే పాణమురా.

ద్వి. భిల్లు:— ఓరీ! ఎంకడూ ! ఓరిపిచ్చోడూ ! యినండి.
నూాన్ బీయింగ్ రీజనబుల్ - హిమస్ట్ గెట్ డ్రింక్
. ది బెస్ట్ ఆఫ్ లైఫ్ - యీాస్ - బట్ - ఇంటాగ్జికేషన్.

తృ. భిల్లు:— సెబాస్. ఓరీ పోలిగా ! ఏదిరా సీసాకాయ్.

ద్వి. భిల్లు:— ఇదిగో ! ఇందు కల్లుముంత. (అని యిచ్చును)

తృ. భిల్లు:— (పుచ్చుకొనితాగినట్లు నటించుచు) వహ్వా! వహ్వా! ఏమిరుసి.

ప్ర. భిల్లు:— (సీసాతీసికొని తాగినట్లు నటించుచు) వారేవా ! వారేవా !

ద్వి. భిల్లు:— (తాగినట్లు నటించుచు) బళే ! ఏమిరుసి, ఏమిరుసి.

ప్ర. భిల్లు:— (కల్లుదాగి) వహావహావ్వా! వహావహావ్వా !

పాట.

హోయిరే సారాయి = బాయఁజాలువారలేరి॥హో॥
ద్వి. భిల్లు:— (మఱలదాగ్రివి) తియ్యతియ్యగున్నాది = తిట్లుతినమ
న్నాది॥హో॥
వారేవా! వారేవా! ఏంకల్లురా! ఏంకల్లురా! (అని
అటు యిటు దిరుగును)
తృ. భిల్లు:— (కొంచెముతాగ్రివి) ఓరిపోలిగా! దీనిసాటిదేదిరా!

కల్లుముంత సెంతనున్న = పెల్లమది వొందుకోరి
సల్లనల్లగల్లిపోని = మల్లిపెల్లి సేసుకొచ్చు॥హో॥

ప్ర. భిల్లు:— ఓరివెంకీ! ఈఘనమైన సారాయ్ యెక్కడ్డిరా?
ద్వి. భిల్లు:— నీకు తెలదంటాగ్రి! కొల్లామ్ సంబ్రంలో కొన్నాను
కానంటాగ్రి!
తృ. భిల్లు:— ఒరేయ్! ఒరేయ్! సెప్పు సెప్పు, కొల్లామ్‌సంబ్రి
మేంటాగ్రి. నానిన్లేదు. కొల్లామ్‌సంబ్రం, కొల్లామ్‌సంబ్రం
చారాయ్‌సంబ్రిమంటాగ్రి కొల్లామ్‌సంబ్రం.
ద్వి. భిల్లు:— అవునురా! ఈసపానకం, తాటిమజ్జిగ, యింకాకొల్లా
ఆఁ ఆఁ (అని నేలఁబడి లేచి) అవునురా.
ప్ర. భిల్లు:— ఓరి ఎంకడూ! ఈకొల్లామ్‌సంబరం చారాయి తీసు
కెల్లి మనయేలికకిస్తే మెచ్చుకొంటాడురా.
(ముగ్గురు వృహాదప్పి నాట్యముజేయుచు)

పాట.

“వద్దురా పెండ్లాము = వద్దురా వద్దురా
ఇద్దరొద్దు నరేగదా = వొద్దువొద్దు వక్కర్తెనా॥వ॥

మొట్టికాయ మొట్టుతుంది = మూతిపిరగ గొట్టుతుంది
అట్టుమూడ గొట్టుతుంది = జుట్టుపట్టి లాగుతుంది॥వ॥

కరములమ్మొ బందాలు = కాళ్ళకూ సంకెళ్ళు .
వరవతి తీసిపెట్టు = పక్కలిరగ తంతుంది॥వ॥

కూలిచేసి బ్రతుకవచ్చు = జోలెయెత్తుకొనగవచ్చు
ఆలికాళ్ళ తాపులకు = ఆగలేము, ఆగలేము॥వ॥

ప్రి. భిల్లు:— అయితే ఎంకడూ! ఏది తాటిమజ్జిగ (అని పుచ్చుకొని త్రావి) మూంచోకుగున్నాదిరా! వా! ఏమిచోకురా! ఓకీ పిచ్చోడూ! చూడు నిన్నటిరేయి పెద్దమనిసి మనకు పైకమిచ్చాడుకాడంట్రా!

ద్వి:— అవురా! అల్లాడ్ని నరికేమని.

తృ:— ఓకీ! కొంపమూంచేహేసినావ్. రహస్యం, రహస్యం.

ప్రి:— ఎప్పుడోరి మనపని.

ద్వి:— ఎల్లి.

తృ:— అయితే, ఓరిపిచ్చోడూ! మొకములనరికే ఆయుధం సిద్ధం చెయ్. పనిపట్టిద్దామ్.

ప్రి:— ఎల్లిగా! రాపోదామ్, రేపీయూలికి మనమందరమూడ్ని ఆఁ!

ద్వి:— డొంకలో ఆఁ! ఆఁ!

తృ:— సరే. ఏలికవచ్చేవేళయింది. పదండోరి పోదాము.

(నిష్క్రమింతురు.)

(అవనికవ్రాలును.)

ప్రదేశము — అరణ్యము.

## చతుర్థరంగము.

(చంద్రశేఖరుఁడు ప్రవేశించును.)



చంద్ర:— (స్వగతము) ఆహా! ఏమి యీకాననమహిమ. కడు చిత్రముగానున్నదే. ఈవిపినంబున్ననుంగొన నాడెందము తల్లడమొందుచున్నది. ఏచాయ గనుగొన్నను భల్లూకనికరంబులే, ఏవంకగాంచినను మృగపతుల సంతతులే, ఏదిక్కు పరికించినను శల్యసంగంబులే, ఏవైపు దిలకించినను గణ్డకచయంబులే గానవచ్చుచున్నవి.

చ॥ అటగన ఘోరసూకర మృ ♦ గాదులుభీతిలఁజేయుచుండె, హా!
యిటగన వ్యాఘ్రసింహకపు ♦ లెంతయు వ్యాకులచిత్తుఁజేసె, నె
చ్చటికిఁక నేగువాఁడనహా! ♦ చయ్యనఁజేరనెపర్వతాగ్రముఁ
కటకట! కాననంబునను ♦ గాచెడువారలిఁకెవ్వరీశ్వరా॥

ఓత్రిపురాన్తకా! ఓపార్వతీశ్వరా! ఓచంద్రశేఖరా! ఉమారమణీ మనోరమణా! నన్నీ ఘోరారణ్యంబునకు రప్పించుటెందులకు? రప్పించితివిపో! ఎన్నరాని జన్మంబులన్ మునుంగ జేయుటేల? ఆహా! ఏమి నాబేలతనము. నేపూర్వభవంబున నొనరించు ఫలిత మిద్యోడ ననుభవింపకదప్పునా. అంతియెకాక దేవమునీంద్రుండానతిచ్చిన వాక్కు లనృతములగునా. వెండియు గడునిడుములగుడువనగునని తొలుత నేవచియించె. క్షత్రియవంశ సంభూతుఁడనగు నేనీమృగంబులకుఁ భీతిల్లెదనా! కాని యీమృగాదుల నొక వేళ దాటివచ్చితినేని, యీయంధకార బంధురంబగు విపినమునన్గల

శిలోచ్చయ మెభ్భంగిజేరుదు. తొలుదొల్త కాత్యాయినీనాథు నా
త్మఁదలంచి యనంతరము నేఁదలంచిన కార్యమునకుఁ గడంగెదగాక.
(చేతులు జోడించుకొని)

పాట.

శంకరా! సాంబశివ! శరణుగిరిసుతప్రియా - శరణునిన్వేఁడితిని
చంద్రధర గావరా॥శం॥
ఏదెసఁ గాంచినను శరభహరితతులె నాకెదురుగాఁ జొచ్చె గద
శూలధర బ్రోవరా॥శం॥
ఎంచగా నామ్రఫల మెటుల గనుగొనెదనో యెఱుఁగ నీకాన
నము నెందుజననొనో హా॥శం॥

(ఒకవైపుజూచి) అదిగో! సింగ మీదెసకే వచ్చుచున్నట్లు
న్నది. ఈశరంబున నాహరిన్గూల్చెదగాక. (అని బాణము విడు
వఁబోవు నవసరంబున)

( తెరలో )

రాజా! తాళుము. తాళుము.

చంద్ర:— (పరిక్రమించిచూచి యేరిన్గానక తనలో) ఏమిది? కడు
చిత్రముగానున్నదే. సింగము దరిజేరుచున్నది. తడవుసే
సితినేని బ్రమాదము వాటిల్లును. గాన దానిం గూల్చుట
యే యుత్తమము.
(అనిశరమెత్తుచుండ మఱల తెరలో)

సుగంధి వృత్తము.

తాళుతాళు రాజవర్య • ధర్మమానె సింగముఁ
గోల చేతబూని కూల్ప • గోరుచుంటి, వేటికీ
లీల జేయఁబాడికాదు • లేచిపొమ్ము శీఘ్రమే
యేలజాగు సేయుచుంటి • విందునుండఁ బోకుమా.

(ఆశ్చర్యముతోతనలో) ఏమిది? ఎవ్వరోగాని మ్రోగేంద్రని గుఱ్ఱమ్లవలదని నుడువుచున్నారు. ఎవ్వరైననా కేమి. చంద్రశేఖరుని కరంబున నీచంద్రహాసమున్నంత కాలము భీతిలువాఁడు కాఁడు. (ఒకప్రక్కఁ దిలకించి) అదిగో! ఎవ్వఁడో రాత్రించరుఁడీదిక్కునకే వచ్చుచున్నవాఁడు. రానిమ్ము. (అని కరవాలంబు దీసికొనును.)

దుర్ము:— (ప్రవేశించి) అళ్ళళ్ళళ్ళళ్ళ. ఓరీమానవాధమా! నీ వెవ్వండవు. విజయసేన మహారాజుగారిచే నియమింపంబడి దుర్ముఖునిచే రక్షింపబడువనంబని యెఱుంగవా.

చంద్ర:— ఓరీదానవాధమా! చందనాపురంబేలు చంద్రశేఖరుఁడీతండని యెఱుంగవా.

దుర్ము:— తెలియకేమి. నీయట్టిశూరులనెందఱనో గనుగొంటిని. ఉసురులపై నాశగలదేని వచ్చినమార్గము న్బట్టి పొమ్ము. లేనియెడ నిష్కారణంబుగఁ బ్రాణంబులు గోలుపోయెదవు.

చంద్ర:— నీపలుకులకు జడియుట కీతఁడు పిరికిపందయనుకొంటివి కాఁబోలు. ఇఁక నీప్రగల్భములఁ గట్టిపెట్టుము.

దుర్ము:— అట్లయిన గయ్యమున కియ్యకొందువా?

చంద్ర:— సందియమేమి. బాహుబలంబరయనిదో వచ్చియున్నవాఁడను. వచ్చినవాఁడవు లేచిరమ్ము.

దుర్ము:— (కోపముతో)

పంచచామరము.

అరేనరాత్మ యిట్లు బల్క ◆ నంత నేభయంబెసఁ
పరాక్రమక్రమంబులాజిఁ ◆ బాడియౌనుజూపనేఁ
గరంబునన్ ధరించినట్టి ◆ ఖడ్గమిప్డు గ్రోచుచున్
ధరాతలంబునందుఁ గూల్తు ◆ ధైర్యమొప్పఁ జూపరా.

ఓరోరీమానవా! నీవేమేమో ప్రల్లదంబులాడుచున్నావు. దానవుఁబాంతనా నీడాంబికములు నిమేషమాత్రమిచ్చోట నిలతువే

ని నిన్ను గొనియాడెద.

చంద్రి:— (కోపముతో) ఓరీ రాక్షసాధమా ; నీకు కాలమాసన్న మగుటచేతనే కాఱులఱచుచున్నావు.

ఉ॥ కండలుకండలౌనటుల • ఖండపరాక్రమవిక్రమంబులన్
జెండెదదేహమంతయును • జీరెదవ్రయ్యలుగాగనీదుమే
నఱ్ఱండలు; ఓరిరక్కసుఁడ • కాలుపురంబునఁ జేర్తునీభుజా
దండముజూపవచ్చితివ? • ధారుణిఁగూల్చెదఁదర్లకుండినన్॥

దుర్మ్రు— ఓరీ ! మాటలకేమిలే. రాక్షసమాయోపాయంబు తెలుంగమి నిభ్భంగిఁగూయుచున్నావు.

పంచచామరము.

బలంబుజూపవచ్చితౌర • పాపినీమనంబునన్
గలుంగునాశలెల్లవీడి • కాంచుఖడ్గధారచే
బలాయనమ్ముగాకమున్నె • ప్రాణమేనుదీయుదుర్
ఫలంబులేదుజచ్చువెనకఁ • బోరుమోరిదుర్మతీ.

చంద్రి:— పంచచామరము.

హుటాహుటిన్రణంబొనర్ప • హుమ్మటంచువచ్చితో
మిటారిగాదుసూడిమూఢ • మేమ్త్రునుంగుచెంగటన్
గటారిచేతఁబూనిపోర • గానగున్ద్రిరంబుగా
జటాలునన్దొలంగిపొమ్ము • జాలియయ్యెనామదిన్.

దుర్మ్రు:— ఓరీ రాజాధమా ! బలాబలంబుల నీకమునననుం గొనెదవు గాక.

స్రగ్విణీ వృత్తము.

చంద్రి:— దానవా! ఆజిని ♦ ధైర్యమున్జూపుమా!
రా! నిన్నుఁ గూల్తుని ♦ ర్భాగ్యవంశోద్భవా॥

దుర్మ:— మానవా! మానవా ♦ మాటలింకేలని!
ప్రాణముల్గొందు ♦ ర్వాదముల్ మానుమా॥

వెండియుఁ బెద్దకాలంబునుండియు నరమాంసము లేమి మిగుల గుందుచున్న నాడెందమునకు మందానంద మొనఁగూర్చితివిరా.

చంద్రి:— ఓరోరి! రాత్రించరా!! పొరపడితివి. పెద్దకాలంబునుండియు నీకై నిరీక్షించుచున్న యమసదనంబున నలమిత్రులన్విడనాడి యీయటవినే తిరుగాడుట యనుచితము కదరా. ఇఁక నేని ద్వరపడుము. కృతాంతుని దరికనుపను ద్యుక్తుండనై యున్నాఁడను.

దుర్మ:— ఓరీ రాజాధమా! కాచికొమ్ము. (అని గ్రుద్దబోవును)

చంద్రి:— (తప్పించుకొని మఱలగ్రుద్దును)

దుర్మ:— అబ్బా! నాతాతను జూచితిరా! (అని కత్తి జలిపించును)

చంద్రి:— (కత్తి జలిపించుచు) ఓరీ రాక్షసాధమా!

ఉ॥ రమ్ము, యనీకమున్ సలుప ♦ రాత్రించరా! యొకముష్టిఘాతముఁ
యమ్మొయటంచు నబ్బురము ♦ నందఁగ నేలఁ బరాక్రమంబులఁ
గ్రమ్మర జూపఁబోడియగుఁ ♦ గాదె మఱొక్కటి గాంచిపొమ్ము, రా
రమ్ము, బిరాన, దుర్మతి! శ ♦ రాహతి నేలబడంగ నేసెదఁ॥

దుర్మ:— (కోపముతో) ఓరీ మానవాధమా!

శా॥ లావుంజూపుము పెక్కుపల్కులవియే ♦ లా, యీలీల, నన్
నీవేగాపు త్రిలోకవాసులయినన్ ♦ నేలంబడన్గొట్టలే
రీవూ చెప్పఁగనేల, దాంభికములన్ ♦ ఇంకేనియున్నాని, రా
రా వ్రారీ మనుజాధమా! మనుదునే ♦ రాత్రించరున్డాకియున్॥

చంద్రః— (స్వగతము) ఏమి వీనిప్రలాపములు. ఊరకున్నకొలంది కాకమ్మట్టుల గూయుచున్నవాఁడు. ఇంతియేకాక త్రైలోక్యవాసులయిన నిద్ధురాత్ము నాస్థానంబున జయింపఁజాలరట. పరాక్రమవిక్రమాదుగంధరుఁడ నేనేయని మిగుల విఱ్ఱవీగుచున్నవాఁడు. అల్పునకిట్టి భావంబు లుదయించుట యనుచితముకాదుగదా. "వినాశకాలే విపరీతబుద్ధిః" అను నార్యోక్తి రిత్తయగునా. ఇఁక తడవుసేసితినేని, యామ్రఫలముచిక్కుట దుర్లభము. ఉద్దానఁ గార్యమంతయుఁ జెడును. ఈముష్కరరాక్షసాధముని మడియించి కార్యసాధనోపాయంబునకుం గడంగుటయే శ్రేయస్కరము. (ఒకవైపు జూచి) అదిగో అహస్పతి తనకిరణముల నలువంకలకుఁ బ్రసరింపఁజేయుచున్నట్లగపడుచున్నది. ఇప్పట్టుననిద్ధురాత్ముని వధింపకుందునేని సూర్యోదయమగును. అక్కతన నామ్రఫలంబగుపడకుంటయేకాక సంతులేనివాడనయి నిరంతరము సంతతికై ఖేదమందనగును. వీనింగడతేర్చుటయేయుత్తమము.

(ప్రకాశముగా) ఓరీ! నీ బాహుబలంబొకసారి చూపుము. (అంతనిరువురు కొంతంవడి యుద్ధంబొనరింతురు. దుర్ముఖుఁడు నేలను గూలును.)

చంద్రః— అయ్యో! పాపమీ రాక్షసాధముండెంత చెప్పినను వినక సంగ్రామరంగంబునసువులఁ బాసెగదా? ఇఁకనామ్రఫలముఁ గొనుట కిదియేయదను.

(అనిరసాలసాలముజ్జేరి ఫలంబుదెంచి నిష్క్రమించును.)

(అవనికవ్రాలును.)

— —



శ్రీరామచంద్రాయనమః.

# రత్నపుత్రికా జయచంద్రీయము.

## ద్వితీయాంకము.



### 1 వ, రంగము.

ప్రదేశము - ఉద్యానవనము.

[రత్నపుత్రిక, పుష్పావతి, లీలావతి ప్రవేశింతురు.]

రత్న:— చెలులారా! ఈయుద్యానవనంబునుం గనుంగొన నాకం తకంత కంతరంగంబున నిసుమంతయుం గొఱంతలేని సంతసము కల్గుచున్నది.

లయగ్రాహి.

సుందరియిదేగనుమ ♦ మందముదమొందఁగను
　　జందనమహీజములు ♦ విందొసఁగిభే! పా
నందరససాగరము ♦ నందుహృదయంబులను
　　బొందుగను గూర్చుమిక ♦ రందముఁగసంగా
నిండుఁగసఁగుందములు ♦ సందుఁగసఁజంపకము
　　లింపుహరిభోగముల ♦ నందసలుపంగా
నిందుముఖులారగన ♦ డెందమికఁదల్లడిలె
　　నందమగునీకుసుమ ♦ బృందములఁగాంచన్ ॥

లీలా:— చెలీ ! నీవమంచానంద మొందుటకుఁ గతంబెద్దియో తెలిసి కొనఁజాలకుంటివా ?

రత్న:— లీలా ! నేనెద్దియు నెఱుఁగను.

లీలా:— నెచ్చెలీ ! నాసద్దనా దాచిపెట్టెదవు.

రత్న:— ఓసీలీలా ! ఇంతకు మున్నెన్నఁడైన నసత్యమాడితినా?

పుష్పా:— అవునవును సత్యమే యాడుదానవు. అందుకు సందియం బంద నెందుకు.

రత్న:— లీలా ! చూచితివా? పుష్పావతినాపక్ష మవలంబించినది.

లీలా:— ఎట్లు?

రత్న:— సత్యమేయాడుదాననని.

లీలా:— నెచ్చలీ ! పొరపడితివి. నీపక్షమవలంబించిన దనుటకు నిర్ధారణయేమి?

రత్న:— సత్యమేయాడుదాన ననుటయే నిర్ధారణము.

లీలా:— ఎన్నటికిని కాదు. నీవాడుదాన వగుటచే నిట్లనియె.

రత్న:— సఖియలార ! మీయసమంజస వాక్యపుంజంబుల కెంతయు నబ్బురమందితి. మాటిమాటికి మీరిరువురు నాప్రాణములు తీయుచున్నారు. నేనందుల కియ్యకొనఁజాలఁడీ.

లీలా:— సఖీ ! ఆగ్రహమంద నేల?

రత్న:— ఆగ్రహమున కేమున్నది.

పుష్పా:— నెచ్చెలీ!

తే॥ గీ॥ కోపమేటికిమాయెడఁ • గోమలాంగి
రమ్ము పోవుదమల్లదూ • రమునసుందు
చెట్టు నీడనుఁగూర్చుండి • చేతఁగల్గు
పొత్తములఁదీసిచూతము • చిత్తమలర॥

రత్న:— సఖులారా ! అటులనే చేయుదముగండు.

(భూరుహాముఁజేరి పొత్తములఁ నరయుచుందురు.)

పుష్పా:— చెలీ! రత్నపుత్రికా! నీమనంబునందెద్దియో యాలోచన సల్పుచున్నట్టు గన్పట్టుచున్నది.

రత్న:— (మందహాసవదనయై యూరకుండును.)

లీలా:— చెలీ! రత్నపుత్రికా! నీడెందంబునంగల సందియంబెద్దియో తెలియఁబలుక రాదటే?

రత్న:— లీలా! నీవూరకుండుము.

పుష్పా:— రత్నా! నేవిననోచుకొనన్నతినా?

లీలా:— పుష్పావతీ! నీకంతయుఁ దెలిసి నాపె నడుగనేల?

పుష్పా:— (లీలావతిచెవిలో) ఆపెచేఁజెప్పించుటకు.

లీలా:— ఓసీ! చాలాయుక్తిమంతురాలవే జుమీ.

పుష్పా:— ఓసీలీలా! నీవూరకుండుము. (రత్నపుత్రికవంకదిలకించి) చెలియా! మూగదానివలె నూరకుంటివేమి?

రత్న:— చెలీపుష్పావతీ! అదెందులకోగాని మదివికార మగుచున్నది.

పుష్పా:— పూవుటమ్ముల బ్రియోగించుటచే వికారమగుచున్నది.

లీలా:— అట్లనా!

రత్న:— నెచ్చెలులారా! నావామపార్శ్వమంతయు నదరఁదొడంగె.

లీలా:— అదియు నొకశుభసూచకమే.

పుష్పా:— నిజము నిజము.

రత్న:— నెచ్చెలులారా! కొంతదనుక విశ్రమింపననుజ్ఞ నీయఁగోరెద.

పుష్పా:— నెచ్చెలీ! నీకిచ్చవచ్చినటులే సలుపుకొమ్ము.

(రత్నపుత్రిక పరుండును.)

పుష్పా:— లీలా! చూచితివా యామె యాందోళనము. పాప మోహజాలక నాయన్నువయెన్నరాని పన్నాగముల నెన్నిపన్నుచున్నదో.

లీలా:— నిజము నిజము. లేఁవ్వనిగదా! ఆపెదోప మెద్దియును గానరాదు.

పుష్పా:— వహ్వా ! కడుచిత్రముగా నుత్తరమిచ్చితివి. నీజవ్వన మట్టులనే జేయును గాబోలు.

లీలా:— చెలియా పుష్పావతీ ! నాకొకటి-తికేయననేల. సుందరీమ ణులందరు జవ్వనమావరించిన తోడనే యనంగుడేయు శర సంగంబుల కోర్వఁజాలరు గదా.

పుష్పా:— ఓసీలీలా ! చిలుకపలుకుల కేమిలే. మననెచ్చెలి ర త్నపుత్రిక యెవని వరింపనున్నదో నీకు దెలియునా.

లీలా:— తెలియ కేమి.

పుష్పా:— అంతయుఁగల్లయే.

లీలా:— నేనన్నృతమాడుదానను గాను. నమ్ముము.

పుష్పా:— నిజమేనా?

లీలా:— నిజమే.

పుష్పా:— అట్లయినపక్షమున నాపె వరించిన రాకొమరుండే రాజ పుత్రుండో తెలియఁజెప్పుము.

లీలా:— ఏమీ. కతంబడుగుచుంటివా. నేఁదెల్పుపల్కులు ర త్నపుత్రికకుఁ దెలియఁబరచుటకుఁగదా యడుగుచుంటివి.

పుష్పా:— ఎన్నటికినిగాదు.

లీలా:— మరెందులకు?

పుష్పా నాకుఁదెలియనందున నుడువమంటిని.

లీలా:— పుష్పా ! పరిహాసమాడితివి. మనరత్నపుత్రికజయచం ద్రు నివరించినట్లు కనుపట్టుచున్నది.

పుష్పా:— నీకీ యుదంతమెట్లు తెలిసినది?

లీలా:— ఆపెముఖముననే వింటిని.

పుష్పా:— ఇంతదనక నాతోఁ దెలుపకుంటివికదా.

లీలా:— తెలుపకుండుటకుఁ గారణము లేకపోలేదు. ఒకనాడు మే మిరువురము కేళికోద్యానకుటీర నికటపద్మాకరంబునకుఁ జని యుంటిమి

పుష్పా:— తరువాత.

లీలా:— కొంతదనుక నేదియెదియో ప్రసంగము జరిగె. పదపడి నన్నుం జేరఁబిలచి, "చెలీలీలావతి! నీకొకరహస్యముం జెప్పెద పరులకుఁ దెలియఁబలుకవలదుజుమా" యని నుడువనే నందు లంకియ్యకొంటిని. అనంతరయూమె భావముఁదెలిసికొంటిని.

పుష్పా:— లీలా! నీవునాకు నర్మసఖవయ్యును యీయేకాంతముఁ దెలుపకుంటివి. కలియుగముకదా? నివేమిచేయుదువు. గతించినదానికేమి గాని నెచ్చెలి వరించిన రాకొమారుని చరిత్రమొక్కింతుక తెలియఁజేయుము.

లీలా:— వినుము.

తే॥ గీ॥ సార్వభౌముండు, సౌమ్యుఁడు • చారుమూర్తి
చందనాపురిపాలుడు • చంద్రశేఖ
రాత్మజుండతఁడతిసద్గు • ణాఢ్యుఁడు, జయ
చంద్రుఁడని బిల్తురెల్లరు • సఖియ! వినుము॥

(రత్నపుత్రిక ఒత్తిగిలుచుండును.)

పుష్పా:— సరియే తెలిసెఁది. లీలా! నెచ్చెలి లేచుచున్నట్లున్నది. అదుగో కనుఁగొనుము. మఱల నొత్తిగిలుచున్నది.

(అనిచూపును.)

లీలా:— (చూచి) అవును. మన కిరుపుర కియ్యడ జరిగిన యావద్వృత్తాంతము సంపూర్ణముగా విందము. నీయభిప్రాయమేమి?

పుష్పా— దానికేమ. అటులేగానిత్తము.

రత్న:— (మేల్కాంచి)

కం॥ చెలియా! యేమనితెల్పుదుఁ
గలఁగంటిని నిద్రయందుఁ • గడుసుందరుఁడో
నిలనేలు రాజపుత్రుఁడు
గఱయంగా రమ్మటంచుఁ • గౌగిటఁజేర్చెన్॥

పుష్పా:— నర్మసఖి ! కందర్పుని కృపావృతమ్ములకు లోనయి లెక్క కురాని పెక్కుస్వప్నంబులం గనుచుంటివి.

రత్న:— చెలీ ! అపహాస్యమేలకే.

పుష్పా:— నెచ్చెలీ ! అపహాస్యమున కేమిగాని నీముఖవికాసము గనుంగొన..................

రత్న:— అర్ధభాగముం దెలిపి పూరకుంటివేమి. వివరముగా వివరింపుము.

లీలా:— పుష్పా ! మనచెలిపంచబాణునకుం జిక్కెఁగదా.

రత్న:— చాలు జాలు నీవాగ్జాలము.

పుష్పా:— చెలియా ! నీమానసంబున కిచ్చవచ్చిన రాకొమరుం డెవ్వఁడోవినఁ గుతూహలముతో వేచియున్నదానను.

రత్న:— ఓసీ ! ఇఁకఁ గేళిసేయుట మానుము.

లీలా:— పుష్పావతీ ! ఆమె యాగ్రహమందుచున్నది. నీవిఁక నూరుకొనుము. నీవెఱింగినచోఁ దెల్పుము.

పుష్పా:— నాకెద్దియుఁ దెలియదు. నీవే నుడువుము.

లీలా:— నాకు నామమంతయుఁ దెలియదు. రెండక్కరములు మాత్రము నెఱుంగుదును.

పుష్పా:— అవిమెవ్వి ?

లీలా:— వినుము. జ .............య.............

పుష్పా:— మిగిలినయక్కరములు. చం.........ద్రుఁ......డు

లీలా:— ఐదక్కరములు గలుప జయచంద్రుఁడనిగదా విశదమగుచున్నది.

రత్న:— (స్వగతము) వీరిరువురునిఁకఁ బ్రాణములఁదీయక మానరు. ఎకసక్కెములకుఁ గొఱంత లేదు. ఒకవేళ నాఆకొనుమందు నేని మఱల మఱలఁ గేళిసేయుదురు. ఇంత దనుక మాయమ్మగారి కొక్కింతయు నీవృత్తాంతమే తెలియదు. తెలియబరచక నాఱకొంటిగేని మదీప్సితమీడేఱుటకల్ల. అయ్యో! ఏమిచేయుటకును బాలుపోకున్నది. నేనిట్టి చింతాబ్ధిని నో

లలాడుచుండ నర్మసఖులొక వంకనుండి యుపహాస్యములఁ జేయుచున్నవారలు. వద్దని గట్టిగాఁ జెప్పితినేని నాచెల్లెలులు నన్ను విడనాడిపోవుదురేమో వారిని విడనాడియే. నొక్కనిమేషమాత్రమయినను మనఁజాల. గుండ నెందులకు? కానున్నది కాకమానదు.

పుష్పా:— నెచ్చెలీ! కోపమువచ్చినదాయేమి?

రత్న:— కోపమెందులకే.

పుష్పా:— మాయిరువురితోఁ బలుకులాడకుండుటకే.

రత్న:— నాకొక్కింతయుఁ గోపములేదు.

( తెరలో )

పుష్పలీలావతులారా! ఇంకను జాలముపరుచు చున్నారా. ఈరేయియే నేను మాయత్తవారింటి కరుగనున్నాను. మిమ్మొకసారి చూడ వేడుకగుచున్నది. ఇప్పుడేవచ్చెదమని తెలియఁజెప్పియింకను రాకుండుటకుఁ గతంబెద్దియో తెలియదయ్యె. వేగముగారండు. వేగముగారండు.

పుష్పా. లీలా:— (ఆలకించి) నెచ్చెలీ! వింటివికదా! మాయనుంగుచెలి రాజరాజేశ్వరి నుడివినవాక్కులు. ఇప్పట్ల నాపెం జూడబోవకుందుమేని మఱల నామెను గాంచు భాగ్యముఁలభించదు. నీయనుమతిన్గొని యరుగనున్నారము.

రత్న:— దానికేమిగాని, యామెయనుంగు జెలియని నుడివితిరి.

పుష్పా:— అవును.

రత్న:— నేనో?

లీలా:— నీవు నర్మసఖివి.

రత్న:— బాగుబాగు.

పుష్ప. లీలా;— పోయిరమ్మందువా?

రత్న:— నన్నొంటిగ విడవాడి పోయెదరా.

పుష్ప. లీలా:— అతి త్వరితముగా వచ్చెదము.

(మజలి తెరలో)

పుష్ప. లీలా:— రత్నపుత్రికా! వింటివా మజలిం బిలుచుచున్నది. అత్తవారింటికేగనున్న మావయశ్శ్యాను నొకటమారుచూచి వచ్చెదము. మేము వచ్చుదనుక నీవీసుమంబులఁ గోయుచుండుము. బిరాన నరుదెంచెదము. సెలవొసంగుము.

రత్న:— చెలులారా! నన్నంతగా వేడుకొనవలయునా! సరియేపొయిరండు. మీరాక కెదురు చూచుచుండెద.

పుష్ప. లీలా:— వైళమె వచ్చెదము.

(నిష్క్రమింతురు.)

రత్న:— (స్వగతము) నెచ్చెలులు మజలి వచ్చువరకు నీనందనంబునంగల వివిధరంగుల సుమంబులఁ గోయుచుండెద.

(అని సుమములఁ గోయుచుండును.)

# ద్వితీయరంగము.

ప్రవేశము— జయచంద్రుఁడు ముకుందుఁడు.

జయ:— మిత్రరత్నమా! ఈయుద్యానవనంబునఁ దిరిగితిరిగి కడుఁ డస్సితిని. నాదురదృష్ట వశంబున నేమృగంబును గానరాదయ్యె.

ముకు:— సంగడీడా! పెక్కుదిక్కుల విహరించుటచే డస్సినాఁడవు. మెకములగుపడని యంతమాత్రమున దురదృష్టవంతులగుదురా. ఆఖటకేళనంబునన్నల వింతయేమిది. అల్లదో యా

వంకఁ దిలకింపుము. ఎద్దియోయొకమృగము గానవచ్చుచు
న్నది. చూడుము. (అని చూపును.)

జయ:— (ఒకవంకఁ బరికించి) అవునవును. కానఁబడుచున్నది.
ఏమృగమో తెలియదయ్యె.

ము:— ఏమియుఁ దెలియకున్నదా? శార్దూలముకాదా. మరియొక
మారుచూడుము.

జయ:— (చూచి) అవునుమిత్రమా! శార్దూలమే. మనవంకకే
వచ్చుచున్నయది. దానిని గడతేర్చుదమా. వీడిపుచ్చు
దమా?

ము:— బాగుబాగు. తడవుసేయుటేటికి? నీకుభీతియగుచున్నదా
యేమి తెలియఁబలుకుము. నేఁగూల్చివచ్చెద.

జయ:— మిత్రమా! ఏమట్లనుచుంటివి. నాకొక్కింతయు భయ
ము లేదు. వెండియు.

కం॥ ప్రాణసఖా! జయచంద్రుఁడు
ప్రాణము లున్నంతదనుక • భయమందడుజు,
మ్లానుడుల నెన్నులాడితో!
బాణహతి గూల్తునిపుడె • పాటవమొకముస్॥

(అని బాణమునుసంధించును)

ము:— మిత్రమా! పరీయూచకమూడితిని. నీవు పరాక్రమవిక్రమ
ధురంధరుఁడవనియే నెఱుఁగకపోలేదు. మున్నొకప్పుడు మృ
గరాజుంగూల్చుట గన్నులారఁ జూచియుంటినికదా. అదిగో
శార్దూలము మనదాపునకే జేరుచున్నది. జాలముసేయక
వైళమె పడనేయుము.

జయ:— (బాణమువిడువ శార్దూలము నేలగూలును.) మిత్రమా
ముకుందా! నాకు దాహబాధ యధికమగుచున్నది.

పంచచామరము.

ముకుంద దస్సినాడనింక ♦ ముందుబోవ జాలహా!
యిఁకెట్లుపోదు నేన్పురంబి ♦ కేలవచ్చి నాఁడ, నీ
వాకింతనీరు దెచ్చినావు ♦ నోసఖా యొసంగవా
యికన్నహీ స్థలంబునంద ♦ దెట్లునిల్తు నక్కటా॥

ముకు:— మిత్రరత్నమా!

కం॥ చొచ్చెదఁ బద్మాకరమునఁ
దెచ్చెద నీరంబునిపుడి ♦ దేనిమిషములో
నిచ్చెద మిత్రమ! నీకిపు
డిచ్చటనే యుండుమీవు ♦ నేగకుమెటకున్॥

జయ:— మిత్రవరా! కడునంతసమయ్యె. సలిలంబుఁ గొనివచ్చి నాపిపానబాధఁ జల్లార్చుము.

ముకు:— సఖా! జలంబుఁదేనరుగుచున్నవాఁడను. నేను మఱలివచ్చువఱకు నీవిచ్చోటుననే యుండవలయుఁగాని వేరొకవంకకుఁ జనవలదు.

జయ:— మిత్రమా! ఇచ్చోడనుండి యెచ్చోడకును నరుగను.

ముకు:— నిశ్చయమేనా?

జయ:— నిశ్చయమే.

ముకు:— ఒకవేళ నీవిచ్చోటుబాసి వేరొకదిక్కునకరిగిన నేనేమిచేయనగును.

జయ:— చెలికాడా! నీవాక్కులకు జవదాటువాఁడనుగాను.

ముకు:— అట్లయినఁ బోయిరమ్మందువా?

జయ:— మంచిది. సత్వరముగారమ్ము.

ముకు:— జాగ్రత్తసుమీ.

జయ:— నమ్మకుంటివేమి.
ము:కు:— నమ్మకుండుటకీ వేమిదోసమొనర్చితివి.
జయ:— అట్లయిన జాలపరచుచుంటివెందులకు.
ముకు:— నీవిచ్చోటుఁ బాయవలదుసుమా.
జయ:— ఇచ్చటనేయుండెద.
ముకు:— ఇదుగో నరుగుచున్నవాఁడను. (స్వగతము) చెలికానికిఁ బలువిధములబోఁదగదని తెలియఁబలికితి. ఏమిచేయునో తెలియకున్నయది. కానిమ్ము. జరుగవలసినది జరుగకమానదుక దా. ఇంతియెకాక పద్మభవునిలిపిదప్పింపనేరికగును. నే నుడివి నహితబోధనల జెవిఁబెట్టక వేరొకదెస కేగునేని ఫలమనుభవింపకమానదు............ (నిష్క్రమించును.)
జయ:— (స్వగతము) ఎందువలననోగాని సంగటీఁడిటనుండి వేరొక వంకకుఁ జనవలదని పలుమారు ముచ్చటించె. కతంబెద్దియోఁ తెలియకున్నయది. ఈప్రాంతంబున రహస్యంబు లెవ్వియైన నుండియుండవచ్చును. లేనియెడ మిత్రుఁడిట్లంగి నొక్కి వక్కాణించుటకు హేతువేమియుండును. అదియునుంగాక దక్షిణపార్శ్వమంతయు నదరుచున్నయది. వేయిపలుకు లేటికింకిటనున్న నాసఖుఁడరుదెంచి కార్యభంగముఁ గావించును. సందియమందనవసరము గానరాదు. కుడిభాగమదరుటయు, మిత్రుఁడిటనుండి యెటకునుఁ బోరాదని పలుసారులు నుడువుటయుఁ బట్టి గనుంగొన నెద్దియేని రహస్యముండియుండుననుటకు రవంతయు సందియములేదు. ఆతఁడు రాకమున్నే నేవెడలుటమంచిది. సఖుఁడురాలేదుకదా. (ఒకచాయవీక్షించి సంతోషాశ్చర్యములతోఁ) అయ్యారే! ఏమియీసుదినము. అచ్చోట నెవ్వతియో నిండుచందురుఁబోలు మోముంజక్కఁదనమ్ముతో నొకసుందరాంగి నానయనంబుల కానందముఁ గొలుపుచున్నది. నేననుకొని నట్లే జరిగినది. ఆ పెనుఁగలయకున్న నాజన్మమేటికి ? ఏరూపునైనను జలిన

ము జేసి యీపెఁ గలసెదఁగాక. ముకుందుం డిందులకే కాఁబో లు వేరొక దెస కరుగవలదని పేర్కొనిచనియె. అదిగో సుమ ములఁ గోయుచు నొకపూవుఁబోఁడి నలువంకలఁ బరికించుచున్నది. హాయ్ హాయ్! మంచితరుణము చేఁజిక్కినది. ఇట్టి తరుణము దప్పిన నిసుమంతయు లాభము లేదు. నాపూనిన కార్యము వ్యర్థమగును. ఆహా! ఈకాంతాశిరోమణి య నిమిషబాలికాతిలక మట్టులఁ గానవచ్చుచున్నది. అమరకాం తయనుట కావంతయు సందియముండదు. నిర్జరభామ కాకు న్న నీజగన్మోహనాకార మెట్లు లభించును. నిక్కువముగా దేవభామినియే.

విభూతివృత్తము.

కాంతన్ గన్గొనినంతన్
చెంతన్ జేరి సుఖింపన్
చింతల్ డెందము నందున్
గంతుల్ వేయుచు నుండెన్ ॥

అద్దిరే! ఏమి యీభాసురాంగి సోయగము. వర్ణింప నజున కైనను వలనుపడదు.

సీ॥ పదియారువన్నె మే ♦ ల్బసిఁడి విద్యుత్కాంతి
మెదిచి రచించె నీ ♦ మేనికాంతి
జాబిలిబోఁలు కం ♦ జాతంబుతోఁ గూర్చి
గళలూర సృష్టించె ♦ గలికిమోము
యలిపోతములచాలు ♦ బలుసుందరస్త్రీలు
గూర్చి గావించె ముం ♦ గురుల సొంపు
జంద్రఖండప్రభాళి ♦ చక్కవద్దపుతెలుఁ
గీలించి నిలిపె చె ♦ క్కిళ్ళ యొప్పు॥

తే॥ గీ॥ నంపెగనునూవుబూవుతో • జతనవరచి
సవరణగదిద్దితీర్చెనా • సావిలాస
మారా! కంజాతభవుఁడు ది • వ్యాంగనలకు
మిన్నగాదీని నిర్మించె • నెన్నినాళ్లో॥

అయ్యారే! మీనాంకునిధిక్కరించు నీయింతి చెంతఁజేరని పురుషునిజన్మమొక జన్మమేనా.

చ॥ మొగచిన కన్నుదోయికల • ముద్దుమొగంబున లేతఁజెమ్మటల్
నిగిడెన మర్త్యకాంతలకు • నెకొనలీయుఁ దలంచిచూడని
మ్మగుదమనుష్యకాంతయని • బొల్చుటకీయరు చక్కచక్కటుల్
దగిలెనుగాని తక్కనవిధంబులు • వేలుపుటింతిచక్కటుల్॥

హాయ్ హాయ్! నిండుపున్నమనాటి చందురు చందంబున వెలుంగు నాయందకత్తియను గనుంగొన నంతరంగ ముప్పొంగుచున్నది.

చ॥ అవిరలవేణి పెన్నెరుల • యందము డెందముగట్టి పట్టిపూ
విలుతున కొప్పగించె బలు • వీరుఁడు మారుడికేమి సేయునో
మెలుకరుఁ బ్రాణసంకటము • నెంచఁగఁబిల్లి చలంతముల్లదా
పులుఁగును బట్టిచూడు శిశు • బుద్ధికిసయ్యది వేడుకౌఁగదా॥.

ఆయిందీవరాక్షిని గనుఁగొన్నకొలఁదిని సౌందర్యవిశేషాది గుణంబుల నుతింపవేడుక యగుచున్నది. ఏమి యూసోయగము. ఏమి యామృదుమధుర కోమలశరీరము. అద్దిరే! ఈ ముద్దియచక్కందనము. అయ్యారె! ఈ నవమోహనాంగినిఁబోలు నంగనలీ జగత్త్రయంబునఁగలరే. ఛీ! జగత్త్రయంబున నేల! నిర్జరపురంబునైనఁ గలరనుట కల్లయే. ఆహా! విధాతమహిమ; మానవాంగనకెంత సౌందర్యముసఁగెను. ఈమందయాన పొందులభించనిన

రుండీ వసుంధర బ్రతికియుండు టెందులకు ?

చ॥ అనిమిష బాలికాతిలక • మట్టులఁగానఁగవచ్చెడిన్ భళా !
యనుపమ రూపసంపదల • కాస్పదమై యలరారునట్టి య
వ్వనితను గూడలేనిమగ • వాడు ధరిత్రిమనంగనేల ? యో
జనవిడి మీనకేతనుని • శాతశరాహతి మూన్పఁజూచెదన్॥

వహ్వారే ! ఈ తరుణీ శిరోమణి నెంతనికొని చూడుదు.

సీ॥ క్షితిజగన్మోహనా • కృతిదాల్చి యసురుల
హింసించినట్టి మో • హినియెయేమొ
వలిమలల్లునిచేత • వంచితుండై పగ
సాధింపదలపోయు • స్మరుశరమొకో
వాక్పతీ, భార్గవీ • పార్వతీ సాధ్వుల
హసియించు బంగరు • ప్రతిమయేమొ
అప్సరాంగనగేల్ప • ల్పవిద్ధాత్రిని
బమ్మనిర్మించిన • పడతియేమొ॥

తే॥గీ॥ మారుమారుని సతియేమొ • మహిని నిట్టి
భాసురాంగిని సౌందర్య • రాసిఁదొల్లి
నెన్నఁడేనియు గంటిమే • యీపెదప్ప
పల్కరించెద నీ ప్రభా • వంబుగనెద॥

ఇప్పట్లఁ బల్కరించితినే నిచ్చోటు వాసి పలాయనమగునేమొ. అట్లయిన నాయభిలషితం బీడేరుటెట్లగు. ఇంచుకసే పూరకొనుట యే యుచితము, (పరికించి) అదిగో ! ఆసుందరవదన మదీయ హృదయ మాకర్షించుచున్నది.

సీ॥ బిబ్బోకవతి! నీదు • గబ్బిగుబ్బల సౌరు
గాంచిమాసుతుసతి • కనలుచుండె
కంబుకంఠిరో! నీదు • కౌనుగాంచినయంత
మృగపతి యొకమూల • మూల్గఁదొడఁగె
నంభోరుహాక్షి! నీ • యాననంబునుగని
ద్విజరాజు మనమున • దిగులువడియె
పద్మగంధిరో! నేత్ర • యుగ్మంబుఁ దిలకింప
నరవిందములు నీట • నణఁగియుండె॥

తే॥గీ॥ చక్రవాకంబు లనునేలు • సఖకుచములు
తారకావళి సరిబోలు • కరరుహములు
శంఖమట్టుల నున్నది • చానగళము
యనటి కంబములన్గేరు • నతివతొడలుఁ॥

ఇఁక తడవుసేయరాదు. ఒక్కసారి యా చక్కరబొమ్మ తోఁ బలుకరించి చూచెదగాక.

ఉ॥ సుందరి! నామమెద్ది? గడు • సుందనమెంతయుఁ బూనియుంటివి
ల్లెందులకోగదా సఖయ! • యెయ్యెడఁబ్రస్తుత ముండుదాన, ఏ
విందుల కేలవచ్చితివిఁ • కెచ్చటికేగఁగ నుంటివిప్పుడో
యిందుముఖీ! భయంబువిడి • యించుక తెల్పదో నీచరిత్రముల్॥

రత్న:— (స్వగతము) అద్దిరే! ఏమి యాతనియందము. కొంత దనుక నూరకుండి యాతని యభిమతం బరసెదఁగాక.

జయ:— (స్వగతము) ఏమిది. నాప్రశ్నముల కుత్తరమీయకున్నది. మఱియొకసారి పిలిచి చూచెదఁగాక. (ప్రకాశముగా) కీరవాణీ! కీరవాణి!

రత్న:— (స్వగతము) ఆతని మృదువాక్యసరణి మనంబున కెంతయు

నాసంద మొనఁగూర్చు చున్నది. రూపలావణ్యరాశియగు నీయందకాదు జయచంద్రుఁడు కాడుకదా. పెక్కుదినాల నుండియు నామనంబా జయచంద్రునియందే నాటుకొనియె. పరపూరుషులతోఁ బలుకులాడుట సాధ్వీమణుల కనుచితము. ఈతఁడు చందనాపురాధీశ్వరుండగు చంద్రశేఖరు నాత్మజుండ నుటకు సందియము లేదు.

చ॥ హరిహయుఁడో! యనంగుఁడో! య • హస్పతియో! కుముదప్రియుండో! యా
సరసిజనాభుఁడో, కుసుమ • సాయకుసండ్రియొ! సర్వమంగళే
శ్వరుఁడో! మరెవ్వఁడో! తెలియ • శక్యమె? భూస్థలినిట్టి మోహనా
కరుని నెన్నైనఁ గంటినె వి • కారముగల్గె మనంబునన్గడున్॥

నిక్కమారయ నిమ్మహనీయునిఁబోలు రూపరులుండరని యె నాయభిప్రాయము.

సీ॥ వేయికన్నులఁ దాల్చి • వెలయు శచీశుండు
సరిరాడు వీని • సౌందర్యమునకు
కాన్తలన్విరహదా • వానలంబున్ద్రోచియు
నిషుమేశుఁడితని • కీడురాడు
మోహనాకృతి శివు • నోర్మి హర్షింపించిన
శార్ఙ్గిగాయీతనితోటి • సాటిరాడు
చక్కఁదనంబున • సరిబోల్చు చంద్రుఁడుం
డందంబునన్వీని • గ్రిందెయగును

తే॥గీ॥ యింతయేమిటికింతుల • స్వాంతములను
అపహరించెడు భువన మో • హనుని నితని
మదన సామ్రాజ్యమునఁగూడి • మాటిమాటి
హాళిఁజెందని జన్మము • దేల భువిని॥

అకటా! ఎట్టిపలుకులాడితిని. ఈతఁడు జయచంద్రుఁడు కానిచోఁ బ్రాణములఁ ద్యజించవలసినదేకదా! పరమేశ్వరుని యనుజ్ఞ యెట్లులున్నదో యేరికెఱుక. దైవానుగ్రహంబున నితఁడు జయచంద్రుఁడు కాకూడదా. నాపాదుసిగ్గు నన్నింతమట్టుకు దెచ్చినది. నేనిప్పట్టున నతనిప్రశ్నల కుత్తరవీయకుందునేని, నాయెడ నలుకనహించు, యీమోహనాంగుఁడు నిష్క్రమించును. అక్కతన మదిప్సిత మీడేరకుండును. పలుకరించి చూచెదఁగాక. (ప్రకాశముగా) ఓ కీరరాజమా!

జయ:— (స్వగతము) అమ్మయ్య! ఇప్పటికీ యువిద నాయెడఁగనికరమూనినది. మఱియొకసారి పిలిపించుకొనుట కిదియేయదను. (ఊరకుండును)

రత్న:— (స్వగతము) నావలెనే యీతఁడును సందిగ్ధవచనముల బ్రయోగింప మొదలుపెట్టినాఁడు. సరియే మఱియొకమారు పలుకరించి చూచెద. (ప్రకాశముగా) ఓరాజహంస! నీయభిదానంబెయ్యదియో వినఁ గుతూహల మానసంబున నున్నదానను.

జయ:— సుందరీమణీ! సిగ్గిల నేటికి? త్వదీయవృత్తాంత మాకర్ణింప నత్యంతకుతూహలముతో వేచియున్నాఁడను.

రత్న:—

ఉ॥ ఓమహనీయ! సర్వగుణోజ్వల! పూరుషసింహమా! నినుం
నామది నెల్లకాలమును ♦ నమ్ముచు నుండుటచేత నీవునా
నేమముఁగోరితో విజయ ♦ సేనునికూతుర రత్నపుత్రికా
నామమునన్వెలంగుదుఁ గ ♦ నన్గనుమీకృపాలశేఖరా!॥

జయ:— (స్వగతము) ఈమె మాళవదేశాధీసుండగు విజయసేనుని కూతురఁట. రూపలావణ్యంబులు గనుంగొన మాసుతునతి యైనను సరిరాదుగా! అయ్యారె! ఈ నవమోహనాంగి

లావణ్యాధీధితులు నా యంతరంగంబునంజొచ్చి చీకాకుపరచు చున్నవి. హాయ్! హాయ్!! ఏమి యీచెలువసోయగము. ఈ మందయాన నాడెంద మపహరించుచున్నదే. ఆఁహా! ఈయనన్య సామాన్యతేజోరాసి నేనెన్నఁడేనియుఁ దిలకించి యుంటినా! అపూర్వ శోభంగలిగి కన్నులకు మిఱుమిట్లుగొల్పుటయేకాక, యత్యంతాశ్చర్య మగ్నునిగాఁ జేయుచున్నది. (ప్రకాశము) బిసరుహాక్షి! చెలులతో రాకుంటి వెందులకు.

రత్న:— భూపాలతిలకా! ఇరువురునర్మసఖుల వెంటఁగొని వచ్చితి.

జయ:— కాంతాశిరోమణి! వారిప్పుడెచ్చట నున్నవారలు;

రత్న:— కార్యావసరముఁబట్టి చనిరి. వచ్చువేళయాయినది. ధరావరోత్తమ! త్వదీయ వృత్తాంతమిసువంత వినఁదగునా.

జయ:— సుందరీమణీ!

చ॥ అలికులవేణి! సుచ్చరిత ♦ మారయనుంటివి కావవిన్ము నే
నిలనలచందనాపురము ♦ నేలునృపాలుని యాత్మజుండ
రత్న:- నిర్మలచరితా! వినస్బలుక ♦ రాదెత్వదీ యభిధానమెద్దియో
జయ:- జలరుహానేత్రి! నన్నుజయ ♦ చంద్రుఁడటందురు నెల్లరిద్ధరఁ॥

రత్న:— (స్వగతము) స్వాంతమా! తొందరఁజెందకుము. నేననుకొనినయట్లె యయ్యెను. (ప్రకాశముగా) భూపాల! కడునంతినమయ్యె.

జయ:— ఇందుముఖి! ఇఁకనికఁటము దాపనేల!

ఉ॥ప్రాయపుటింతి! నిన్గన న ♦ పారముదంబుదయించె వెండియు
న్బాయనివేడ్కనామనసు ♦ బట్టిపెలార్చుచున్న దిప్డు ప
ష్పాయుధుఁడేయు తూపులకుఁ ♦ జందనగంధి! మనంగజాల
రావే, యనురాగపుంజమ! భూవిఁనినుపీడి నిమేషమోర్వనే॥

జయ:— మందయాన! అమందానంద మొందితిఁగాని యిచ్చోట
నే కాలయాపనముసేయుట లెస్సగాదు. ఏవరైనను నియ్యె
డ కరుదెంచి మనలంగాంచినచో సందియమందుదురు. కావు
న నేనేగెద. (అనివడివడిగా కొంచెముముందు కేగి తనలో) నా
మిత్రుఁడు నాకై యెన్నిబన్నముల నందుచున్నవాఁడో కదా.
ఛీ! "కామాతురాణాం, నభయంనలజ్జా" అను పండితవాక్య
రీతి నగునా. కామాతురులు మైమరతురు. సంగడీఁడు జలం
బుఁగొనివచ్చి నారాక కెదురు చూచుచున్నవాఁడు కాబోలు
లేక ఘోరారణ్యంబులంబడి గుమ్మరుచున్నవాఁడో; తెలి
యదయ్యె. నాయట్టికృతఘ్నుఁడు ముల్లోకంబుల నుండఁడు.
పిన్ననాటనుండియు నొకనాఁకరము విడనాడక మెలంగుచుం
టిమి. ఇన్నినాళ్ళకు [illegible] వేసకావుసివచ్చె గా
బోలు ఇప్పట్టున [illegible] సల్లాపముఁ గట్టిపెట్టి
ప్రాణసమానుఁడగు చె[illegible]కి కలసికొనియెద. (ప్రకా
శముగా) సుందరీ నేఁక [illegible]డవుసేయుగాదు. నిన్ను మఱల
గలసికొందును. నిష్క్రమించును.

రత్న:— (స్వగతము) ఆఁహా! నాచెలులెచ్చోట నున్నవారలో గ
దా! వారలవిడనాడి నేనొంటిగ మందిరము న కేగితినేని మదీ
య జననీజనకులు డెందమున సందియమందకపోరు. నెచ్చెలు
లను దోడ్కొనిపోయెదనన్న వారిజాడ తెలియరాదయ్యె.
కటకటా! ఏమిచేయుటకు నుపాయ మరయజాలకున్నదాన
ను. ముంగు కేగిన నుయ్యియు వెనుకకరిగిన గొయ్యియు నను
సామెత సార్థకమయ్యె. వారింతదనుక రాకుండుటకు హే
తువేమైయుండునో? ఛీ! ఈపాడుజవ్వన మెంతటి ఘనకా
ర్యములనేనియుఁ జేయించునుకదా. నర్మసఖులమాటయే ద
లపోయక రాజకుమారునితో ముచ్చటించుచు కాలమువ్యర్థ
పరచితిని. గతించినదానికి ఖేదమందినఁ గార్యమేమి. చెలు
లు వచ్చుదనుక నిచ్చోటున నుండుటయే సమంజసము. నెచ్చె

లులారా నన్నేటికీ దుఃఖాబ్ధిం బడద్రోసెదరు. (చెలులనవలోకించి)

ఉ॥ మువ్వురమొక్కకంచమున ♦ బోనమునిచ్చలు నారగింపమే
మువ్వుర మొక్కమంచమున ♦ మోదమెలర్పగ ( బవ్వలింపమే
యివ్విధి నన్నునొంటిగను ♦ నీవనమధ్యముడించి పోయిరో
జవ్వనులారమీరలిటు ♦ జాగొనరించుటదేటిధర్మమో॥

అదిగో ప్రభాకరుఁడస్తాద్రిc జేరఁబోవుచున్నవాఁడు. ఇఁక నేనియుc జాలముసేయక బిరానరండు.

పుష్పా=లీలా:— (ప్రవేశించి) చెలియా రత్నపుత్రికా! ఏకాంతముగా నుంటివెందులకు?

రత్న:— (స్వగతము) ఏమి వీరివాక్చాతుర్యము. నేనారాజకుమారునితో ముచ్చటించు నవసరమున నీసమీపముననే పొంచియుండి మాపలుకుల నిరువురు నాలకించిరి కాబోలు. (ప్రకాశముగా) సఖులారా! మీ రెక్కడి మాటలకేమిగాని, మీచేతనుండునవేమి?

పుష్పా:— సకియా రత్నపుత్రికా! వినుము.

తే॥ గీ॥ అల్లిబిల్లిగనల్లిన ♦ మల్లెపొదలc
జేరి కుసుమంబులను గోసి ♦ చెంతcగల్గు
బంతిచామంతి మొదలగు ♦ వింతగొల్పు
కుసుమములc దెచ్చినారము ♦ కోర్కెలలర॥

వెండియు నీగులాబిపూబంతు లెంతవింతగనున్నవో చూడుము.

ఉ॥ కాంతరో! కాంతునిన్గలసి ♦ కౌcగిలిసేయుచు నుండునప్పుడీ
వింతగుబంతులీ వెగుర ♦ వేసిన నంతకు నంతకంతకున్
వంతలcబాపి సంతసము ♦ పారముగూర్చెడు నీగులాబిపూ
బంతి మఃటింతి! యేమనుముc ♦ బ్రాణసఖుల్దరిc జేర్పకుండునే॥

రత్న:— పుష్పావతీ! నిరంతరము నపహాస్యము లేనా. చాలుంజాలు నీయొకసకెకలములు కట్టిపెట్టుము. నాకుఁగోపమువచ్చుచున్నది.

లీలా:— సఖిమా! ఇంతమాత్రమునకే యాగ్రహ మందుచుంటివా? నీతో నపహాస్యము చేయరాదనియే నీయభిప్రాయమా? అట్లయినఁ బ్రాణేశ్వరునితోఁగూడి మదనసామ్రాజ్యంబున మైమరచియుండు నవసరంబున మగనిచే నపహాస్యంబులందు నపుడేనేమందువో.

రత్న:— నెచ్చెలులారా! చిలుకపలుకుల కేమి. మీపలుకుల కలుక వహింపుట లేదు. కాలాతీత మగుచున్నది. రండు పోవుదము.

నిష్క్రమింతురు. (అవనిక వ్రాలును.)

## తృతీయరంగము.

ప్రదేశము — అరణ్యము.

ప్రవేశము — ముకుందుడు.

ముకుం:— (స్వ) ఆహా! ఏమియీచిత్రము. జయచంద్రుడిచ్చోటువాసి యెచ్చోటున కేగియుండనోపు. జలంబుఁదే నియోగించి నేమరలివచ్చునంతలో నితఁడు మోసముజేసెను. నీరమునకై నన్నెన్నియో బన్నములనంది యెట్టకేలకు సలిలముఁగొని వచ్చితి. ఇంతలోనే యెటకో పలాయనమైతివి. మిత్రమా జయచంద్రా! అతివల వలలోఁబడి మోసపోయితివా యేమి.

సీ॥ మిత్రరత్నమ నన్ను • శత్రువుగా నెంచి
దరినుండరాదంచు • నరిగినావా
చెలికానివిడనాడి • స్వేచ్ఛగాఁ దిరిగెద

నంచు డొంగముసుంగు నెంచినావొ
సంగఁడీ డెప్పుడు ♦ సరసవాగాడుచునుండు
ననుచు నీమదినెంచి ♦ యరిగినావొ
నెచ్చెలిదరినున్న ♦ నెంతుంత్రో రతిఁ
దేఁగాదని పర ♦ దెంచినావొ

తే॥ గీ॥ ప్రాణమిత్రమ ! యింకేమి ♦ భావమందు
దలఁచి నీవేగినాడవొ ♦ తెలియఁదరమె
యెచటనుంటివొ మిత్రమా ! ♦ యేమిసేతు
నోర్వకున్నది నామది ♦ యుర్విపాల॥

ప్రాణమిత్రమా ! సింహశార్దూలాది మృగసంతతులచేఁ గీడు గల్గెనా ? లేనియెడ మందిరమునకు మఱలితివా ?

ఉ॥ నిచ్చలునిచ్చనచ్చు కర ♦ ణిఁగ గడుముచ్చటలాడికొంచు వి
వ్వచ్ఛుఁడు లచ్చితేడు బలె ♦ వారిని కాలము గడ్పుచుంటిమో
సచ్చరితా ! వివేకమతి ! ♦ సంగడికాడ ! కృపాలవాల ! న
న్నిచ్చట వీడిపోయితివె ♦ యేక్రియ నిన్గనుగొందుఁ గ్రిమ్మరన్॥

మిత్రమా! ఇచ్చోటువాసి పోవలదని పలువిధములఁ బలికి యుంటినిగదా. నానుడులఁ జెవినిడక నెచ్చోటునకేగితివి, ఇచ్చటన కాలయాపనముచేయుట పాడిగాదు. కాననసీమలఁ దిరిగితిరిగి మిత్రుని గలిసికొనియెద. (నిష్క్రమించును.)

(అవనిక వ్రాలును.)



శ్రీరామచంద్రాయనమః

# రత్నపుత్రికాజయచంద్రీయము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

దర్బార్

(ప్రవేశము — విజయసేనుఁడు, భీషణుఁడు)

విజ:— సచివాగ్రణీ!

ఉ॥ సేమమె భూసురావళికి ♦ సేమమె క్షత్రియవంశజాళికిన్
సేమమె వైశ్యపాళికిని ♦ సేమమె నాలవజాతివారికిన్
సేమమె పండితావళికి ♦ సేమమె సేనకు, భృత్యకోటికిన్
సేమమె, సర్వజీవులకు ♦ సేమమె, తెల్పుమ మాత్యశేఖరా॥

భీష:— సార్వభౌమా!

తే॥ గీ॥ భూసురులు క్షత్రియోత్తముల్ ♦ మొదలుగాఁగ
నాల్గుతెగలవారును మహా ♦ నందమొంద
గష్టమెద్దియులేకెల్ల ♦ కాలములను
మెలఁగుచున్నారు మనమహిన్ ♦ మేదినీశ॥

విజ:— మంత్రివరా! అత్యంతసంతోషాంతరంగుఁడనైతి. విశేషం
బులెవ్వియైనంగలవా?

భీమ:— దేవర యే సెలవీయనగును.

విజ:— మంత్రిభీమణా! అవును చెప్పమరచితిని. నాముద్దుల పట్టి యగు రత్నపుత్రికకుఁ బరిణయ సమయం బాసన్నంబయ్యె. గాన వివాహప్రయత్నంబుల నుండఁగు

భీమ:— దేవా! చిత్తము.

విజ:— మంత్రివరా! మాబంగరుబొమ్మకుఁ దగుసుందరాంగుఁడు లభించుట దుర్లభమని తలంచెద.

భీమ:— రాజేంద్రా! పరమేశ్వరుఁడు భార్యాభర్తలను నియమించి యేయున్నవాఁడు. అందులకంతగా పరకునేల.

విజ:— మంత్రీ! వరాన్వేషణార్థము ధరామరోత్తముల నియోగింతుమా. నీయభిప్రాయమేమి?

భీమ:— దేవా! స్వయంవర మహోత్సవముఁ జాటబంపుటయే యుత్తమమని నా యభిప్రాయము. అనంతరము దేవరవారి చిత్తము.

విజ:— అవును మంత్రీ! అట్లొనర్చుటయే నాముఖ్యోద్దేశము.

తే॥ గీ॥ మంత్రిశేఖర! వెంటనే ♦ మరలి పరిణ
యంబునకుఁ దగు యత్నంబు ♦ లాచరింప
నాజ్ఞఁబరపుము నేడెనే ♦ య్యమ్మొఁర్ప
నెఱుఁగఁబంపుము సర్వభూ ♦ మీశతతికి॥

భీమ:— నృపాలశేఖరా! భవదాజ్ఞానువర్తినై యెల్ల దేశాధీశులకు వర్తమానమంపెద.

విజ:— మంత్రీ! మనమింతలోఁ దగుప్రయత్నముల నుందుదమా?

భీమ:— చిత్తము. జాలముసేయరాదు.

విజ:— మంత్రీ! పోయివత్తమురమ్ము. (ఇరువురునిష్క్రమింతురు)

అవనిక వ్రాలును.



## ద్వితీయరంగము.

(ప్రదేశము — స్వయంవర మంటపము.)

ప్రవేశము — విజయసేనుఁడు, భీమణుఁడు, కొందరు రాజకుమారులు రత్నపుత్రిక, పుష్పావతి, లీలావతి, మొదలగువారు.

విజ:— అమ్మా! రత్నపుత్రికా! ఈనృపాలశేఖరులఁ దిలకింపుము. ఇందుఁగల రాజపుంగవులలో నీమనంబున కిచ్చవచ్చిన రాకొమరుని వరింపుము. ముద్దులపట్టిరమ్మా. (అనిదరిఁజేర్చుకొనును.)

రత్న:— (మందహాసవదనయై యూరకుండును.)

పుష్పా:— చెలీ లీలా! చూచితివిగదా మననెచ్చెలి మందహాసము.

లీలా:— అవునే. ఇంకనూ జూచుచుండుము.

విజ:— అమ్మాయీ! సిగ్గిలనేటికి?

పుష్పా:— (రత్నపుత్రికం జేరి) నెచ్చెలీ! ఈరాజబృందంబు సమందానందమొందఁ గనుంగొనుము.

రత్న:— (నలువంకలు పరికించును.)

లీలా:— సకియా! నీముఖవికాసము పరీక్షింప నలవికాకున్నయది.

పుష్పా:— లీలా! నీవీలీల నేల మననెచ్చెలిఁ గేలిచేసెదవు?

లీలా:— ఇదియే యదనుగదా.

పుష్పా:— అట్లనా?

లీలా:— అవును.

పుష్పా:— నెయ్యంపుసకియా! రత్నపుత్రికా ఎంతకాలమీసిగ్గు?

లీలా:— కొద్దిదినములె. పైని............

విదూ:— కొద్దిదినములు మాత్రమె. అనంతర మావలగాదుకదా.

పుష్పా:— అయ్యో! కొంచెమూఁగుఁడు ఏలమీకీయనవసరప్రసంగము.

విదూ:— అమ్మాయీ! మాయులమల్లివాయేమి?

లీలా:— ఓసీపుష్పావతీ! అతనిజోలి మనకెందులకు. నీనియమిత కార్యంబెట్టిదియో చూచుకొనుము.

పుష్పా:— (రత్నపుత్రిక వంకదిరిగి) నర్మసఖీ ! ఈపూలహారము నీవు వరింపనున్న ధాత్రీశసుతుని కంఠమలంకరింపఁ జేయుము.
(అని పుష్పహారము నందించును.)
రత్న:— (హారమునుఁ గొనును.)
లీలా:— పుష్పావతీ! వారివారినామధేయంబులఁ దెలియఁజేయుము.
పుష్పా:— అట్లన ? (రత్నపుత్రికం గని) చెలియా! యాకర్ణింపుము.

మత్తకోకిల = బాలికామణి! గాంచుమీతఁడు • బాలుఁడేగనుఁగొన్న బాం।
చాలదేశపు రాజపుత్త్రుఁడు • సర్వశాస్త్రములందునన్।
జాలగాఁగను కీర్తినొందిన • సత్ప్రభుండగుఁగావునన్।
లీలమై వరియింపుమీ యువ • లీలగా మదినెచ్చెలి॥

రత్న:— (మిన్నకయుండును.)
లీలా:— సఖీ ! పుష్పావతి ! వేరొకరిఁ జేరొఱనుము.
పుష్పా:= రత్నపుత్రికా! ఇటుకనుఁగొనుము.(అనిఒకరాకొమరుంజూపి)

కవిరాజ విరాజితము.

చెలియరో! యీతఁడు వంగపురీశుఁడు • చిన్నికుమారుఁడు రూపము
దిలఁగల మానవులీతనిఁబోలరి • కేటికినారయుచుంటివహో!। [నం।
చిలుకలకొల్కిరో ! నీదుమనంబున • సిగ్గిలనేటికిఁ దక్షణమే।
గలియుమినృపశేఖరపుత్త్రునిఁ • గల్గును సౌఖ్యములెల్లమెడన్॥

రత్న:— (శిరమువంచుకొని నిలువంబడును.)
లీలా:— పుష్పావతీ ! వంగపురాధిపతిన్వరింప నీమెకిష్టమున్నట్లగుపడదు. వేరొకరిని వక్కాణింపుము.
పుష్పా:— చెలియా ! కనుఁగొనుము. (ఒకనిఁజూపి)

ధృవకోకిల = గనుమునెచ్చెలి ! గన్నులారఁగ • గాశిరాజతనూభవుం ।
డినుని చందముమైనతండొగి • నింపుసొంపలరారుపీ ।

తనివరించి త్వదీయభావము ♦ దారతన్మనఁ గోరెలెఁ
మునుగుచుండుమ సంతసంబున ♦ పూవుఁబోఁడిరొ! నిచ్చలున్ ॥

రత్న:— (యథావిధిగా నిలువంబడును.)
లీలా:— పుష్పా! ఆవసుంధరాధిపుండీ యిందుముఖి డెందమానందిం పఁజాలఁడు కాన నింకొకనిఁ జేర్పుఁడనుము.
పుష్పా:— నెచ్చెలీ! ఇటుగనుము. (వేఱొకనిఁజూపి)

మత్తకోకిల=మానినీమణి! గాంచుమీతఁడు ♦ మత్స్యదేశనృపాలుఁడే!
వ్వాని కైనను భీతిఁజెందెడు ♦ వాఁడుగాడు ధరిత్రిలోన్!
గాని విద్యయనంగవానికి ♦ గానరాదకటా! చెలీ!
యేను దెల్పిన వన్ని నిక్కవ ♦ మిష్టమైన వరింపుమా॥

రత్న:— (పాదాంగుళితో నేలనువ్రాయుచు నిలువంబడును.)
లీలా:— పుష్పావతీ! మననెచ్చెలికీ మత్స్యదేశాధీశుని యందాకర్షణాసక్తికొలందియగుటచే నింకొకని యభిదానముం దెలిపి హర్షాంబుధి నోలలాడింపుము.
విదూ:— ఇచ్చోటుంగలవారలేరు నీమగువఱుం దగరుకాబోలు.
పుష్పా:— చెలియా! రత్నపుత్రికా! ఈరాకొమరునిఁ జూడుము. (అని ఒకనింజూపి)

మత్తకోకిల=చంద్రశేఖర రాజపుత్రుఁడు ♦ చందనాపురి పాలుఁడే!
చంద్రవంశభవుండు వెండియు ♦ సత్యశీలుఁడు వీరినా!
యింద్రుఁడైనఁ జయింపనేరఁడీ ♦ కీతనిఁ రణభూమిలోన్!
చంద్రబింబసమానుఁడౌ జయ ♦ చంద్రునిన్వరియింపుమా॥

రత్న:— (మందహాసవదనయై పుష్పహారమును జయచంద్రుని కంఠమున వేయును.)
నార:— (స్వగతము) పెద్దకాలంబునుండియు నెయ్యోడను గయ్యంలు లేక నెయ్యంబున నుండుటం జేసినా యీకడుపు దినదిన

ము క్షీణించుచున్నది. ఎన్ని జన్మముల నైననందవచ్చునుగాని యాఁకలిబాధ కోర్వఁగలమా. రేయింబవళ్ళు కడునిడుముల గుడిచి పైకమార్జించుటయెందులకు. ఈబొజ్జకే. ఉదరపోషణార్థమై యనేకులు పడెడుపాట్లు నాకన్నులార జూచుచున్నాఁడను. అబ్బా! ఏమి యీయాఁకలిబాధ. ఎన్నియో యత్నములసలిపి నాసుకృతవశమున నేఁడీవిజయసేనుని యుద్యానవనంబునంగల యామ్రఫలం బపహరించి పొట్టనింపుకొంటిని. నాటనుండియు నేటిదనుక కయ్యంబులు పొసంగవయ్యె. ఏక్రియనీ యాఁకలిబాధఁ దీర్చికొందునాయని యంతరంగము తొందరపడుచున్నది. ఏమిచేయుదును. (కొంచెమాలోచించి) ఆఁ తెలిసినది. తెలిసినది. జడియ ననవసరము. దొడ్డయాలోచనే పొడగట్టినది. విజయసేన చంద్రశేఖరులకుఁ గయ్యముగల్పించితినా, యిక నారుమాసములవరకు కాలముగడపెదను. పెద్దకాలము వేచియున్నందులకు మంచితరుణము చేఁజిక్కకపోలేదు. ఇట్టితరుణము వ్యర్థపరచితినేని సఫలీకృత మనోరథుండనగుట సున్నయె. ఏమిది నేనిటకువచ్చి సుమారరగంటయైన నింకను ఒకభటుఁడైనను లోనుండిరాడయ్యె. కొంతదనుక నిరీక్షించి యనంతర మవసరమైనచోఁ భటుఁ బిలచెద. (కలయఁజూచి) అదిగో! విదూషకుఁడిటకే వచ్చుచున్నవాఁడు. ఈతఁడసామాన్యుఁడు. వీనిఁ బుట్టఁబెట్టనాతరమగునా. లేక నాతాతతరమగునా. పొట్టనింపుమని గంపెడాశతో విజయసేనుని దర్శింపఁ గుతూహల మానసుండ నైయుండ నీవిదూషకుఁడిచ్చోటున కేలరావలయు. ఇదంతయు నా దురదృష్టమేకాని వేరొండుకాదు. ఆతఁడు సమీపించుచున్నవాఁడు. కర్తవ్య మరయవలయు. ఏపగిదినైన నితని బిరాన నంపివేయు నుపాయమున నుండెద.

విదూ:— (ప్రవేశించి నారదమునీంద్రునిఁగాంచి సంతోషాతిశయంబున) ఓహో! కలహాకంఠ మహారాజుగారా! నమస్కారమండి.

నార:— దీర్ఘసుమంగళీభవ.

విదూ:— అయ్యా! తామెచ్చటనుండి వచ్చుచున్నవారు?

నార:— ఓయీ! నాకడుపు కాలుచున్నది. నారాక వెనుకనుండి తెలియఁజెప్పెద. మీరాజుగారెచ్చోటనున్నారు.

విదూ:— మీకడుపు కాలుచున్నదా! అయ్యో! ఏదీమంట. (అని కడుపుపై చేయివేసి చూచుచుండును.)

నార:— ఓయీవిదూషకా! ఆకలిబాధయగుచున్నదని నాయర్థము.

విదూ:— ఏ కలిబాధ యగుచున్నది?

నార:— అనగా.

విదూ:— సూర్యతనూజుఁడు కలిగాఁడా.

నార:— అవునుగాని, నాకు పెక్కుదినములనుండి బోనములేమి, నా కలియగుచున్నది. తెలిసినదా.

విదూ:— ఆ! తెలిసినది.

నార:— సరియే. దానికేమిగాని ముందు మీరాజుగారేమి చేయుచున్నారో తెలియఁబలికెదవా?

విదూ:— ముందు మారాజుగారు కూర్చొని యున్నారు. వెనుక సభ్యులు............

నార—(కోపముతో)ముందుచెప్పెదవా లేదా.(అనిదరిఁజేరఁబోవును.)

విదూ:— (కొంచెమావలకేగి) అయ్యా! నాచుట్టనిప్పునకు మీగడ్డంబులు తగిలిన ప్రమాదము వాటిల్లును. కొంచెము దూరముగానుండుఁడు.

నార:— ఓయీ! రాజుగారితో నేనువచ్చితినని తెలియఁజేయుము.

విదూ:— ఏరాజుగారితో?

నార:— ఎందరురాజులిందున్నారు?

విదూ:— పెద్దరాజు...చిన్నరాజు...మధ్యరాజు... చాలా మందున్నారండి.

నార:— నాకర్థముగాలేదు, వివరింపుము.

విదూ:— ఈవలరాజు, ఆవలరాజు, మధ్యమహారాజు.

నార:— ఆయనకొఱకే వచ్చితిని. ఆయన నామధేయమెద్ది ?

విదూ:— మహాత్మా ! వేసిరాజంటారండి.

నార:— వేసిరాజేమిటి ?

విదూ:— మీ రెన్నడు చదరంగమాడ నట్టున్నది. ఆయాట నేర్చుకొనియెదరా. అప్పుడన్నియు స్పష్టపడును.

నార:— ఓయీ ! అపహాస్యమునకుం గడంగితివా. శపించమందువాయేమి ?

విదూ:— మహాత్మా ! మొన్న మొన్న నే తమవంటి పెద్దలవద్ద మార్గాలరాగము నేర్చుకొని, అదియే యాలాపన సేయుచు నడుమ చదరంగము జ్ఞప్తిరాఁ. బ్రసంగవశమున మీతోనిట్లంటిని. నన్ను మాత్రము శపించకండి. మహారాజుగారికి మీరాక తెలియజేయించెద. (అని ఒక వైపుజూచి) ఓరీ సేవకా ! ఇటు రమ్ము.

సేవ:— మహాప్రభో ! ఏమిసెలవు ?

విదూ:— (సేవకునకు నారదునింజూపి) ఓరీ ! ఈమహాత్మునికి మహారాజుగారి దర్శనము లభింపఁజేయుము.

సేవ:— చిత్తము మహాప్రభో.

విదూ:— మహాత్మా ! రండుపోవుదము.

(అందరు నిష్క్రమింతురు.)

(అవనిక వ్రాలును.)



## చతుర్థరంగము.

[ప్రదేశము — విజయసేనుని దర్బారు.]
(విజయసేనుఁడు, భీమనుఁడు ఆసీనులై యుండగాఁ దెరయెత్తఁబడును.)

ప్రతి:— (ప్రవేశించి) విజయసేనమహారాజా! జోహారు! జోహారు!!

భీమ:— వార్త లేమిగా ?

ప్రతి:— మహాప్రభో ! ఎవ్వరోగాని నెరసిన గడ్డంబును చేతియందు నొక వంకరకఱ్ఱయును గాషాయ వస్త్రంబులును గలిగిన నొక వృద్ధబ్రాహ్మణుఁడు భగవధ్యాన పరాయణుఁడై ద్వారంబుననుండి దేవరవారికి దెలుపనన్నుఁ బుత్తెంచె. దేవర యానతినడపి, ఆతనిలోనికిఁ గొనివచ్చెద.

భీమ:— ఓసి ప్రతిహారీ ! నీవతిత్వరితముగా నరిగి యతనిన్వినయపూర్వకముగా లోనికిఁబంపుము.

ప్రతి:— దేవర యానతి శిరసావహించెద. (నిష్క్రమించును.)

[పాముడు నారదుఁడు ప్రవేశించును.]

విజ:— (లేచి) మునీంద్రచంద్రమా ! విజయసేనుఁడిదే నమస్కారంబు లాచరించుచున్నాఁడు.

నార:— పుడమిఱేడా! కళ్యాణమగుఁగాక !

భీమ:— మునికులశేఖరా ! మదీయ నమస్కృతులఁ గైకొనుఁడు.

నార:— ఓయీ ! చిరంజీవివై వర్ధిల్లుమురాత !

విజ:— తాపసోత్తమా ! ఈయుచితాసన మలంకరింపుఁడు. (అని ఒక ఆసనము చూపును.)

నార:— నారాయణ ! నారాయణ ! (అని కూర్చుండును.)

విజ:— సమానీ వృత్తము.

మానిచంద్రమా ! గనఁగఁ
మానసంబు నందెప్పుడుఁ

గానరావు చింతలు నిం
కేను పుణ్యామూర్తినిలగా.

తాపసోత్తమ! తావకదర్శన కతంబున నేనొనరించిన పురాకృత పాపంబులన్నియు నంతరించినవి. వొడియుఁ ద్వద్ద్వయమలపదపంకజముల స్పర్శచే మద్గృహము పవిత్రమయ్యె. తామెచ్చోటఁ లేదిల కించి యీయెడ కరుదెంచినారో తెలుపవలసేని.........

నార:— రాజా! మానులకొక చోటుగలదా. ఎల్లెడలను దిరుగు చుందువాఁడను.

విజ:— మహానుభావ! ఆయాస్థలంబులంగల విశేషంబుల నావీనుల వేసి విందుగావింపఁ బ్రార్థితుఁడు.

నార:— విననిచ్ఛగలదో?

విజ:— వినఁగుతూహల మానసుండనై యున్నవాఁడ.

నార:— (ఆత్మగతంబున) మత్ప్రిత మీడేకట కిదియేయదను. ఎప్పుడు విజయసేన చంద్రశేఖరులకుఁ గయ్యము గల్పించి నాపొట్ట నింపుకొందునాయని మానసము తహతహ లాడుచున్నం దులకిదియే మంచితరుణము. (ప్రకాశముగా) రాజా! చెప్పుట కేమిగాని, తత్కారణంబెఱుంగఁ బలికితినేని రోషంబున దోషంబున కొడిగట్టుకొందువను భయంబునఁ దెలుపుట కెంతయు సందియమగుచున్నది. ఇకహితమునసే కలహాంశన బిరుదాంకితుఁడనైతిని.

విజ:— దేవా! సందియము వలదు. మీయాజ్ఞనతిక్రమింప నేనెంతటివాఁడను.

శిప:— తాపసోత్తమా! భవద్వచనంబు లాలకింప నత్యంతోత్సాహముంగలవాఁడను. సుజనపోషకుండును, అరిభయంకరుండును, ద్వదీయపథేయుండును నగు విజయసేన మహారాజుగారు గౌతూహలంబుననున్నవారు గాన వివరింపఁ బ్రార్థితుఁడు.

నార:— రాజపుంగవా ఆకర్ణింపుము. నీజామాత ప్రియజనకుండగు చంద్రశేఖరుడత్యంతరమ్యతి మీకాంతారములోనియామ్రఫలము...

విజ:— మునివరా! వివరముగా వివరింపుడు. వినమానసము త త్తరపడుచున్నది.

నార:— తస్కరించెను.

విజ:— ఏమీ? తస్కరించెనా? తరువాతఁ దరువాత,

నార:— తరువాతనో రాజా! అయ్యాదిగొంపోయి యర్ధాంగిగొనెఁగె.

విజ:— (కోపముతో) ఎంతపని. ఎంతపని జరిగినది. తదుపరి!

నార:— ఆయనకు జయచంద్రుఁడను కుమారుం డుదయించె. జామా తయే.

విజ:— (మంత్రి వైపుదిరిగి) మంత్రీ! ఎంతపనిజరిగినది. కాంతారమంగల దుర్ముఖుని గతియేమయ్యెనోగదా?

నార:— (స్వగతము) నావాంఛతీరినది.

భీమ:— రాజేంద్రా! ఆతనిమడియించియే యుండవచ్చును. లేనియెడఁ జంద్రశేఖరునకా రసాలసాలముంజేర వశమగునా.

నార:— సందియమేల?

విజ:— (విచారముతో) కటకటా! ఎట్టియిక్కట్టులు సంభవమయ్యె.

భీమ:— మహారాజా! గతించినదానికేల విచారించెదరు?

విజ:— (విచారాగ్రహంబులతో) ఆద్దురాత్ముండు మదీయ పరాక్రమంబుల కొంకకయు వెరువక యిట్టిదారుణ కృత్యమునకొడికట్టకొనెనుగా. కానిమ్ము. సంగరరంగంబున నద్దురాత్ముని వధింపకపోయితినేని విజయసేనుఁడనుగాను.

ఉ॥ తారలసంగముల్పగిలి ♦ దాండవమాడిన నాడుఁగాక, యూవార్ధులింకుఁగాక, హరి ♦ వచ్చిరణంబున నిల్చుఁగాక, భూభారముదాల్చుమాత, ♦ యపవాదము నాయెడఁజూపుఁగాక, నేఘోరరణంబు నందతనిఁ ♦ గూలుతువహ్వ! యనంగనెల్లరున్॥

(అని లేవఁబోవును.)

భీమ:— (వారించి) దేవా! శాంతింపుఁడు. శాంతింపుఁడు.

విజ:— మంత్రీ ! శాంతమూను టెట్లు ?

నార:— రాజా! తొలుత నేరోమముంజూ పెదవని తెలియఁజెప్పితిఁగా.

విజ:— దేవా ! క్షమింపుఁడు.

నార:— రాజా ! శాంతమూనుము. (పీఠమునుండి లేచి) రాజమంత్రులారా ! నేనరుగుచున్నాఁడ. ఆజ్ఞయిండు.

(రాజమంత్రు లిరువురు లేచి నమస్కరింతురు.)

నార:— విజయోస్తు. (నిష్క్రమించును.)

విజ:— మంత్రీ ! మనమిఁక జేయునదేమి ?

భీమ:— భూనాయకా ! సంగ్రామరంగంబునఁ జంద్రశేఖరుని సరిచేయుటయే.

విజ:— అవును. అట్లే చేయుదము. సైన్యంబుల సమరాయత్తులుగాఁజేయ సేనానాయకున కాజ్ఞనొసంగవలయుఁగదా. రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

(అవనిక వ్రాలును.)



శ్రీ రామచంద్రాయ నమః

# రత్నపుత్రికా జయచంద్రీయము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.



[ప్రదేశము — అరణ్యము.]
[ప్రవేశము — రత్నపుత్రికా జయచంద్రులు.]

జయ:— మనోహారిణీ! ఈభయంకరమగు నిర్జరారణ్యమునకీ వేళవచ్చితివి. రావలదని పలుమారులు తెలియఁజెప్పినను నాపలుకులాలకింపక నావెంటనంటితివి.

సీ॥ స్వర్ణనిర్మితలసత్ • సౌధంబులందుండు
కాంతరో వనమెల్లఁ గాంచనమ్యో
తూగుటుయ్యాలలందు • నూగులాడెడునాతి
కాననంబునఁ దిరు • గాడనమ్యో
పువ్వులపాన్పుల సదా • పవ్వళించెడుబాల
గఱుకురాళ్ళఁ బరుండఁ • గానదమ్యో
పంచభక్ష్యంబులఁ • బల్మారుదినురామ
కాయకసరులఁ బొట్టఁ • గాయనమ్యో

తే॥ గీ॥ రాజరాజతనుంభవు • రాజ్ఞివయ్యు
నింతి! గహనంబునన్గల • యిడుములెల్ల

బొందఁగానయ్యె నయ్యయో! ♦ పూవుఁబోణి
రాకుమన్నను వచ్చితో ♦ రాజవదన !॥

రత్న:— మనోనాయకా! సుత్రీకొంబనియేమి? కాంతకుఁ గాంతుఁ
డేకదా దైవము. అట్టిచోఁ గాంతునితో వెంటనంటెనఁ గాం
తకికష్టములనట్టివి?

సీ॥ ప్రాణేశ! మీపద ♦ పద్మంబులఁ గొల్వ
వనచయంబులు నుప ♦ వనములయ్యె
ప్రాణనాయక! మిమ్ము ♦ భావంబునందిడ
కష్టంబులెల్లఁ సు ♦ ఖంబులయ్యె
ప్రాణవల్లభుని నేఁ ♦ బ్రార్థించినంతనే
కందమూలములు భ ♦ క్ష్యంబులయ్యె
నామనోధనమ! మీ ♦ నామముల్ స్మరియింప
సాలముల్గాగు టు ♦ య్యాలలయ్యె

తే॥ గీ॥ గాననోప్రియ! మీదయ ♦ గల్గెనేని
చింతలింకేటి కరయ మీ ♦ చెంతఁ జేరి
వెంటనంటెదఁ బదముల ♦ విడువఁజాల
నాథ! ననుబ్రోవవే సుగు ♦ ణాలవాల!॥

జయ:— (స్వగతము) ఆఁహా! ఏమియీమనుగువ వాక్సుధారసము!
ఈసుదతి పతివ్రతా తిలకమనుటకు సందియమేమి? తేనియ
లొల్కు చిలుకపలుకులబలె నుడివిన పతివ్రతా ధర్మంబుల
కే నేభంగిఁ బ్రత్యుత్తరమిచ్చెద. సాధ్వీమణుల నామోచ్చా
రణఁ జేసినంతమాత్రమున నఘంబులంతరించునను నుడు లన్నృ
తములగునా. అకటా! మనుష్యసంచారములేని యీకాంతా
రసీమ కేలరావలె? చిలుకను బోధించినటులఁ బలుమారు
లు రావలదని నొక్కి వక్కాణించిననువినక, నాతోఁబయనమై క

ఘునిడుమల నందుచున్నది. అయ్యో! మందస్మితసుందరవ
దనారవిందముకందు వాడియున్నది. నామనోహారియు, సా
ధ్వీశిరోమణియు, నాక్షేమాభిలాషియు నగు నీయిందీవరాక్షి
యందుచున్న బన్నంబుల గనుంగొన నాయంతరంగమున నొక
వింతమార్పుకలుగుచున్నది. (ప్రకాశముగా) నారీరత్నమా!

వ॥ జనసంచారములేని యీయటవిన్ • సందేహమున్నాసి. రా
మని మెట్లీయకొనెవ్వచింపుమిఁక, రా•మా, నీమనోనాథుతోన్

రత్న:— (స్వగతము) అకటా! మన్మనోహరుఁడు నాకై మిగుల
సంతరంగమున జింతులుచున్నవాఁడు. ప్రేమానురాగమన
నిట్టిదియేకదా. తానందుచున్న బన్నంబుల కొక్కింతయు లె
క్కసేయక నాయెడంగల ప్రేమాతిరేకంబున నాబడునిడుమ
ల నరయుచున్నవాఁడు. ఇమ్మహనీయుని మనస్తాపముఁ జ
ల్లార్పవలయు. (ప్రకాశముగా)

జననాథాగ్రణి! యిట్లసంజనునె? మీసాన్నిధ్య ముర్వీవిడియే
ను నివాసంబుననొంటె నుండుటకునెన్తో నాత్మలోఁగుందెదర్॥

జయ:— కాంతామణి! గమనాయాసమున డస్సితిమిగాన రమ్ము
ఒక్కింతతడవీ భూరుహముంజేరి విశ్రాంతి నందుదము.

(ఇరువురు నొకభూరుహముఁజేరి కూర్చుందురు.)

రత్న:— (ఒకవంక దృష్టిసారించి) ప్రాణేశ్వరా! అల్లదో! అచ్చటఁ
గాంచుఁడు. వాయువేగ గమనంబునఁ బిక్కబలంబుచూపు హ
యమగుపడుచున్నది.

జయ:— (వాజిఁగాంచి) నిజము నిజము. ఔరా! ఆ హయము క
డురయంబున మనదరికే మఱలుచున్నది.

రత్న:— (భయముతో) నాథా! అదిగో! అశ్వరాజము మనవంక
కే వచ్చుచున్నది. ఎక్కతంబుననొంగాని దానింగాంచిన భీతి
యగుచున్నది.

జయ:— (సంతోషాశ్చర్యములతో) ప్రాణేశ్వరీ! ఘోటకమున్నని సంతమాత్రమున జడియనగునా. భీతిల్లకుము. నేనిప్పటునఁ జని నిమేషమాత్రంబున నావాజింగొని వచ్చెద.

రత్న:— ప్రాణవల్లభా! ఆతురంగము మనకుటంగటకు రానిండు.

జయ:— సుందరీ! జాగుసేయవలదు.

కం॥ చెంగున దాటుచుఁ దోలిదెస
కుంగమనంబెంతో జూపు ♦ ఘోటకమును నేఁ
బొంగుచుఁగొని వచ్చెద నీ
చెంగట కైయుండఁ మిచటఁ ♦ జెచ్చెరవత్తుఁ॥

రత్న:— కం॥ జోడా! హయముఁ బట్టఁగ
నేడా, ఈయెడనునన్ను ♦ నేకాంతముగా
వీడన్నాడిమె? గనపూ
బోడిఁ మీ వెంటగొనుఁడు ♦ భూవరతనయా!॥

జయ:— మనోనాయకీ! 'పట్టఁగనేడా' అని నుడివితివే. నేనాహయముఁబట్టి నీదరికిఁగొని రాఁజాలనా?

రత్న:— నాథా! నాయభిప్రాయమదియే.

జయ:— ఎద్దికతము.

రత్న:— మనోహరా! ఆఘోటకము మనల మోనపుచ్చునను సందియమువలన.

జయ:— కాంతా! బలవింతగానున్నదే. నీవిచ్చోటనుండుము. అటగో ఆ అరబ్బీదాపు జేరుచున్నది. తడవుసేసితినేని కురంగము చిక్కదు.

రత్న:— ప్రాణేశ్వరా! మీచిత్తము. తెలుపవలసిన దెద్దియో తెలిపితిని. (జయచంద్రుఁడు నిష్క్రమించును.)

రత్న:— (స్వగతము) అయ్యో! ఈకాంతారమధ్యంబున నన్నొంటిగా విడనాడి హయమున్గొనిరా మన్నాథుఁడద్దాని వెంటనం

కొ. ఈయరణ్యంబున నబలనొక్కతెఁ విడనాడి చనుట భావ్యముకాదని యెఱింగియు మనోహరుండరిగె. ఇంతకు దైవబలంబెక్కుడుగదా. భయమొంద నవసరము గాన రాదు.

మద:— (ప్రవేశించి రత్నపుత్రికఁగాంచి తనలో) భళిరే ! ఆకుంద నపుబొమ్మ యందము నాడెందము నమందానంద మొందఁజేయుచున్నది. అయ్యారే ! ఇట్టినారీరత్నమునుమున్నెన్నఁడేనియు గాంచియుంటినా. ఈమెలనాగ దేవభామినియైయుండ నోపు. అద్దిరే ! ఏమి ఆసుందరవదనారవిందము ! మానవజన్మమెత్తినందులకిట్టి రూపలావణ్యరాశియగు నబలామణింగూడి మదనసామ్రాజ్యంబున నోలలాడిన దేకదా జన్మసాఫల్యము. లేనియెడ సర్వసౌఖ్యంబులు సున్నయే.

తే॥ గీ॥ ఇంతిగాదిది ముత్యాల • దొంతిగాని
బోటిగాదిది రతనంపు • మూటగాని
కొమ్మగాదిది యపరంజి • బొమ్మగాని
నారిగాదిది మరుని క • టారిగాని॥

అద్దిరే. ఏమి ! ఆసోయగము.

సీ॥ కలువరేకులబోలు • కల్యాణి నేత్రముల్
హరిమధ్యనునుబోలు • దరుణికౌను
జుక్కలవోలె నైన • ధిక్కరింపగజాలి
వాల్గంటి వదనంబు • వరగుచుండె.
బంగారుగిండుల • భాతివెల్గునునాతి
కుచయుగ్మమయ్యారె • గూర్చెమునము
హాటకనిర్మిత • మైన బొమ్మవిధంబు
గానుపించెడుమేను • కాంతియహహా !
తే॥ గీ॥ అట్టినవమోహనాంగిఁ జేపట్టినట్టి
పురుషసింహుఁడు తొలిజేయు • పుణ్యమెగద

కటకటా! ఈపెనేరీతిఁ ♦ గలయువాఁడ
మారుశరములకేనింక ♦ నోరువఁజన॥

ప్రకాశముగా నారీరత్నమా!

ఉ॥ ఎవ్వతెవీవు? నొంటరిగ ♦ నింతిరో! భీతియొకింతలేక నీ
వివ్వనభూమిజేరఁగత ♦ మెయ్యది? తెల్పుము బాలికామణీ!
జవ్వనులిల్లు రాఁజనునె? ♦ సత్వరలీల వచింపుమింకనో
జవ్వని! నిన్గనుంగొనవి ♦ చారము బాసెను నామనమ్మునన్॥

రత్న:— అన్నా! ఏను విజయసేనుని కూతురను. రత్నపుత్రికానామధేయురాలను. వెండియుఁ జందనాపురిపాలుండగు చంద్రశేఖరుని కోడలను.

మద:— మందయానా! మగనివిడనాడి యీవనాంతరంబున నీవేకాంతముగా నుండుటకుఁ గారణమేమైయుండును?

రత్న:— సహోదరా! మేమిరువురము చందనాపురంబేగుచు మార్గమధ్యంబునఁ గడుడస్సి యొకతరుచ్ఛాయను విశ్రమించితిమి.

మద:— తరువాత?

రత్న:— అంత నెటనుండియో నిటకొక ఘోటకమురా, మన్నాథుండద్దాని వెంటనంటె.

మద:— (స్వగతము) నాపన్నాగముపాటినది. (ప్రకాశముగా) సుందరీ! నిప్రాణేశ్వరుఁడరిగి యెంతసేపయినది.

రత్న:— ఈపాటికి వచ్చుచునేయుండును.

మద:— అబలామణీ! నీనాథునికై యేలవేచియుందువు?

రత్న:— (స్వగతము) వీని రాకటంబట్టి గనుంగొన నిద్దురాత్ముఁడు కామాతురుఁడై యున్నట్లగపడుచున్నది. అయ్యో దైవమా! ఇఁకనేమిసేయుదు. నన్ను గాపాడుభారము నీయదియే. (ప్రకాశముగా) సతికి పతియేగదా గతి.

మద:—పతికి సతిపై ననురాగమున్నచో...

రత్న:— అధిక ప్రసంగమునకుం గడంగకుము.

మద:— సుదతీ! ఆగ్రహమందనేల, ఇఁకనీపతి మఱలివచ్చుటకల్ల. ననుఁబతిగాఁ జేసికొమ్ము.

రత్న:— (కోపముతో) సహోదరా! ఇట్టిదుర్భాషలు నీనోటరాఁ జెల్లునా.

మద:— ఎనునీకు సహోదరుఁడనుగాను. నీవు నాకు సహోదరివియు గావు. పతియగుదును. సతియగుదువు.

రత్న:— (స్వగతము) వీనికంతకంతకు బ్రల్లదము లధికమగుచున్న వి. ప్రకాశముగా ఓకీతులువా! చాలుఁజాలు. నోరుమూయుము.

కం॥ ఇలఁగల లలనామణులను
గలయన్మది నెంచనోర? ♦ కడుదుర్మతివై
కలయం దెనను నిటుపైఁ
దలపోయకు మట్టిపని, య ♦ ధర్మముజుమ్మా॥

మద:— ఓహో! ఏమిసీటుకులు. కట్టిపెట్టుము.

మ॥ లననా! నిన్వడనాడి నిల్వ ♦ గనా! లావణ్యరాశీ! ననుఁ
గలయన్జెల్లదె?..............................

రత్న:—పాపి! యిట్లనుడువం ♦ గాబాడియే?...........

మద:— కోమలీ!..................................

యలుకన్బొవిడనాడి యింక పయి నైన♦నాహ్లాదమున్గూర్పవే

రత్న:— కల నైనన్ బరకాంత ( గోరఁదగునా?............

మద:— కార్పణ్యమున్మానుమా.........................

ఓకె మహోన్మత్తా!

కం॥ కులసతి రతిఁదేలుచు నిం
పలరగ ధరమెలఁగనోను ♦ రా! యిఁకఁజాల్చాల్
కొలఁగుము నాదరినుండక

తులువా! పాపంబటంచు • దోపదె మదిలోన॥

మద:—సుగంధి॥ కోపమేలకోమలాంగి! • కోరికదీర్పరాఁగదే
రత్న:— పాపమంచునెంచవయ్యొ • పాపిమానవాధమా!
మద:— రాపుసేయనాయమౌనె • రమ్ము జేరు కౌఁగిటన్
రత్న:— నీపురంబు జేరువింక • నీల్గఁబోకుమో ఖలా!॥

మద:— కాంతాశిరోరత్నమా! నీకింతపంతమేల.

ఉ॥ చిక్కెమనంబు నీపయిని • సిగ్గిలనేల నిజమ్ము నమ్మవో
చక్కరబొమ్మ! మన్మథుఁడు•జాలియొకింతయులేక కూరుఁడై
యిక్కటులెన్నియేనియును • నిచ్చుచునుండెను తాళఁజాలనన్
మక్కువమీరఁ గౌఁగిటను • మానిని! జేర్పుముకోపమూనకే॥

(దరిజేరఁబోవును.)

రత్న:— (కొంచెమావలకేగి తనలో) అకటా! ఇద్దురాత్ముఁడంత కంతకు మిట్టిపడుచున్నవాఁడు. మఱియొకసారివినయముగాఁ బలికి చూచెదఁగాక. (ప్రకాశముగా)

శా॥ అన్నా! యిట్టిదురోక్తులాడఁదగునా•యత్యంతమున్ దోసమౌ
నన్నా! నిక్కమన్న! నాదు నుడుల • స్వంగీకృతి న్జూపనౌ
నన్నా! చెల్లెల నీకునేననుచునీ • యాత్మందలంపోయనౌ
నన్నా! పాపము మూటఁగట్టుకొన • కన్నా వేడెదన్వేమరున్॥

మద:— కాంతా నీకెంతజెప్పినను బంతము మానవైతివి. కంతుని బాధ కొకింతయుఁ దాళఁజాల. రమ్ము. కౌగిలిమ్ము. (జేరఁ బోవును.)

రత్న:— (దూరమునకేగి తనలో) కటకటా! ఇద్దురాత్ముఁడు నాస మంజసవాక్యంబుల నావలకుఁద్రోసి కామాతురుఁడై నామా నముఁ జెఱుప సమకట్టినాఁడు. ఇఁకనేమిచేయుటకును దోప

నున్నయది. ఇందిరారమణుని నొకమారు ధ్యానించి యనం
తర మీరామరాత్మునకుఁ దగునుత్తరమిచ్చెద. అప్పటికిని దాప
ట్టినపట్టు విడువఁడేని నా యీవజ్రపుటుంగరమే నన్నుఁ
గాపాడును.

ఉ॥ శ్రీధర! భక్తపాల! సర • సీరుహలోచన! యెంతకాలమీ
బాధలకోర్తు, నీమొసలి • బారిదొలంగెడి మార్గమెద్ది? రా
వే, దయగాంచవేయనుచు • వేడిన హస్తినిగాచినట్టి యో
మాధవ! చక్రహస్త! వడి • మానముగావఁగ రమ్ము మ్రొక్కెదన్॥

(ప్రకాశముగా) ఓరోరీ! పరనారీ మానసంహారకా! నేనుడి
విన హితవులన్నలపోయక పరకాంతల పొంతజేరి కేళీవిలాసంబులందేల
నీలీల నేలఁబలుక సమకట్టితివి?

మద:— ఓసీ! వన్నెలాడీ! ఓసీటుక్కులాడి! నీటుకులసట్టి పెట్టిమ
కుఁవమీర నొక్కసారి నీచక్కనిచెక్కిలి నొక్కనిమ్ము.
(అని దరిఁజేరఁబోవును.)

రత్న:— (దూరముగాజరిగి) ఓరీపాపాత్మ! ఇఁకనేనియు నీదుందుడు
కుఁ బోనాడుము.

మద:— (మందహాసముతో) మందయాన! నీయందముగని మఱల
విడనాడగలనా. నాయభిలాషితం బీడేర్తువేని నిన్ను విడనాడె
ద. లేనియెడ నొక్కయుగమైనను గదలనీయను.

రత్న:— (చేతులు జోడించుకొని)

## దండకము.

శ్రీరుక్మిణీలోల! గోపాలబాలుండవై నీవు బాల్యంబునన్ గో
పికాబాలికల్ గట్టిగా నుట్టిపై బెట్టి యున్నట్టి యామట్టిపాత్రల్ వడిన్గొ
ట్టియందుండు క్షీరంబులన్ద్రావుచుండంగ నాగోపిబాలల్ల హాసోప
మున్బ్యాలిచే కోలలన్బట్టి నీపొంతకున్వచ్చుచున్నంత నీవప్డు నక్కాంత

లన్నాంచి రోషంబుచే వారలన్నీతిగావింపవే. వెండియున్, దుష్టులైనట్టికంసుల రణంబందునన్ దున్మించిలోకంబులన్గాచి, ద్రౌపదిన్మాన భంగంబువాటిల్లకేగాపవే, వెండియీమర్త్య తిన్పుంచి నానాధునిన్నాదరి న్జెద్పవమోయచ్యుతా ! పుండరీకాక్ష ! గోవింద ! గోవింద ! నారాయణా ! ఓమురారీ ! నమస్తేనమ స్తేనమః॥

మద:— మదవతీ !

చ॥ సుదతిరో ! సత్వరంబ కృపఁజూడుము జాలమికేలబాలయూ
మదనుని, పూవుటల్లులకు మానసమెంతయుఁదాళకుండెడిన్॥

రత్న:—అధముఁడ ! నీదుపాపములఁ గంతమువెంతనె గంతులాడసీ
మదిగల గర్వమేపగిది మార్చుకొనందగు దీవుమర్త్యతీ !॥

మద:— (స్వగతము) ఈమె గట్టిపట్టుపట్టియున్నది. నాకులోనగుటకల్లయే. భటులరాఁబనిచి కారాగారంబున నుంపించి యప్పటికేరియు మరిపిన్ని మీఁదేర్పునేమో చూచెద. అందులకీయకొననిచో నంతమొందించెద. (ప్రకాశముగా) భటులారా!

2. భటు:— (ప్రవేశించి) దేవరయాజ్ఞ శిరసావహించెదము.

మద:— భటులారా ! ఈయబలామణి గొనిపోయి బందిగమునను నుంపుడు. (నిష్క్రమించును.)

భటు:— అమ్మా ! రాచవారమ్మా ! రమ్ము బందిగమునకు

రత్న:— సేవకులారా ! అందుకు సంసిద్ధురాలనై యున్నదానను.

( నిష్క్రమింతురు. )

(అవనికవాలును.)



## ద్వితీయరంగము.

[ప్రవేశము — అరణ్యము.]

[ప్రవేశము — జయచంద్రుఁడు విచారముతో]

హా ప్రాణేశ్వరీ ! చంద్రాననా ! నా నెయ్యంపు సకియా ! నన్నీ కాంతారసీమ నేకాంతముగా విడనాడి యెయ్యెడ కేగితివో గదా.

లయగ్రాహి:= అకటకట నను న్విడచి • యిక్కటికముం దలచి
యెక్కడికి నేగితివి • మక్కువగు కొమ్మా
నిక్కము వచించుమిఁక • దిక్కుఁగనఁజాలఁగదు
సుక్కిటితినయూరె మన • మిక్కడకు రాఁబల్
చక్కనిహయంబు మన • దిక్కునకు నేకతము
గ్రక్కునను జేరె నలు • దిక్కులకుఁ ద్రిప్పఁ
అక్కజమునం దగఁ జ • టుక్కున నదృశ్యమయి
యెక్కడికిఁ బోయెను • రక్కసివితానన్॥

అన్నులమిన్నా ! నన్నెన్నరాని బన్నంబులఁబడద్రోసి చననీ మనసెట్లొప్పెను. అంతకారిన్యము వహింతువని కలనైనఁ దలపోయకుంటినిగదా. నీయెడల నేనొనరించు దోసఁగెద్దియో తెలియఁబరుపక, యిబ్భంగిమోసపుచ్చి పలాయనమైతివా. చీ! నీతో సరసమెంతలకు. (వెంగళివలె నటించవలయును.) అదిగో ! నామది నపహరించిన సుందరాంగి (నతిదరినున్నట్టుల భావించి)

సీ॥ మోహనాంగిరో ! నీదు • ముద్దుగుల్కెడుమోముఁ
జూపినావంతను • బాపరాదె
కళ్యాణి ! నీదువా • ల్గంటి చూపులువెసఁ
గరుణించి నామీఁద • బరుపరాదె
భూపాలసుత ! మన • స్తాపంబుదీర నీ

కనకదేహముఁజూపఁ • గడఁగరాదె
కీరవాణిరో ! నీవు • కేలునాపైమోపి
మోహాబ్ధిలోనన్ను • ముంపరాదె

తే॥ గీ॥ మలయమారుత సమయంబు • మందగమన
నందనంబునఁజేరి యా • నంద మొంద
తోడి టఁ లేరునాదరి • తోయజాక్షి
కెళ్ళగూడుము నేనింకఁ • దాళఁజాల॥

(ఒకవైపుజూచి) అకటా ! నిష్కారణముగా మోసపోయితినే. నాయర్ధాంగి యింతలో మోసపుచ్చి యెచ్చటికోఁబాగిపోయె. కొలది కాలముకిందటనేకదా నాదరిజేరి నన్ను హర్షాంబుధి నోలలాడించి నది. వగువా ! ఎచ్చోటున కేగితివి. అయ్యో ! ఇఁకనాకేమిగతి. ఈకాననంబునన్గల మృగంబుఁనడిగిన నాయింతి వృత్తాంతము దెలి యునేమో.

సీ॥ హరులార! హరులార !! • హరిమధ్యమును నేడు
కంటిరే మీరలీ • గహనమందు,
కరులార ! గిరులార !! • కంజాక్షినిన్నేడు
కంటిరే మీరలీ • గహనమందు,
చక్రచక్రములార ! • చంద్రబింబాననఁ
గంటిరే మీరలీ • గహనమందు,
బ్వారిబ్వార్గములార ! • బాలేందువదనను
గంటిరే మీరలీ • గహనమందు,
తే॥ గీ॥ నాదుముద్దులగుమ్మను • నాదు సతిని,
నాదుగృహలక్ష్మి నామహా • నందఖనిని.
నాదుహృదయేశ్వరిని, వెండి • నాదుసఖిని,
గాంచినారలె యటవీమృ • గంబులార॥
(ఒకవంకదిలకించి) అదిగో, నాయర్ధాంగి అరసాలసాలము పొం

త డాగియున్నది. (వడివడిగా సాలముఁజేరి) కటకటా! ఎంతపాటుకలిగె. నాయింతియేయని స్వాంతమున నెంచితిగాని తుదకు వెరానపోయితిని. ఇఁక నేనేమి చేయుదు. (విచారముతో)

పంచ॥ సతీలలామ! యీగతిన్వి • చారసాగరంబున౯
పతిన్వనాంతరంబుఁబీడి • బాల! యెడ కేగితో
సతంబు బల్వ్రతంబుల • న్వ్రశాల నేత్రి! బిల్వనే?,
గతిన్వచింప కిటుపీడ • గానయంబె ప్రేయసీ॥

ఓసీ మంజుభాషిణీ! నీసమంజస వాక్యపుంజంబుల న్వీన నోచుకొంటినో లేదో తెలియదయ్యె. మందయాన! నీసుందరవదనారవిందము మఱలఁ గనుంగొను భాగ్యమీ మందమతికబ్బునా? అబ్బకేమి? అపహాస్యమున కెందేనియుఁ దాగియుందువు.

ఉ॥ నీనగు మోము, నీపలుకులు • నీదగు కల్వలఁబోలు నేత్రముల్,
నీనడఁ సొంపు, నీకులుకు • నీదగు సోయగ మెన్న నెంతయే,
న్మానసమందు జేరినను • మాటికిమాటికిఁ గుందజేసెఁ గ,
ళ్యాణి! బిరానవచ్చికడు • హర్షమునొందగఁ గౌఁగిలీయవే॥

అయ్యో! ఈమందమతికి నీపొందు మఱలలభించునే, ఇంతదనుక నెట్టెట్టులో కాలము వెళ్ళఁబుచ్చితిన్గాని, యింక నిన్నునిచ్చడనాడి బ్రతుకుట దుర్లభంబని మనంబునఁ దోచెడిని. ఇంతయును బూర్వజన్మకృతకర్మ ఫలితంబనుభవింపక తప్పదుగదా! వెండియు సరస్వతీమనోహరుని లిఖితంబు దప్పింపనేరకగును.

చ॥ కరుణయొకింత లేక ఘన • కాననసీమను నొంటిపీడి యీ
కరణిఁజనంగఁబాడియొకో? • కారణమేమొ వచింపరాదె? యే
సరణి ధరాస్థలిన్మనుదు • సత్కులంబుల్ సరస్వతీమనో
హరు లిఖితంబు తప్పదని • యారయ సత్యముసత్యమిమ్మహి౯॥

పుల్లాబ్జేక్షణా ! నన్నేటికీ విధంబునఁ గుందఁజేసెదవు.

కం॥ బాలా ! దుఃఖాంబుధి న
న్నేలా ? యిట్లుద్రోసిపోతి ♦ వెయ్యేడకో, యిం
కేలీల మనుదుఁ బుడమిని
జాలంబింకేలరమ్మ ♦ సత్వరలీలన్॥

మనోహరాంగీ ! అనంగుబారి కోర్వఁజాలని యీమందభాగ్యునియెడ నీకింత కాఠిన్యమున్యాయనం జెల్లునా ?

పంక్తి వృత్తములు=బాలరో ! నన్నీ ♦ లీలనువీడన్
ఏలవృథాగాఁ ♦ దాళఁగఁజాలన్.
మానిని ! నిన్నీ ♦ కాననసీమ
న్ధానసయెయ్యో ♦ యేనెటుసైతున్.
ఏలపహాస్యం ♦ బోలలితాంగీ !
జాలమదేలా చాలిఁక రమ్మా.

ముద్దులగుమ్మా ! నన్నే మికతంబున బల్వేతల మఁంచుచుంటివి నాయెడ నీకిసుమంతయుఁ జాలిలేదయ్యేఁగాబోలు. ఇఁక నైనను జను దెంచి నాయంతరంగమున్నల వంతద్దెగటార్పఁజేయుము. లేనియెడ నే నీ భూమండలమునఁ బ్రాణములతో నుండుటకల్ల. ఇంతదనుక నప హాస్యమునకుం గడఁగితివని తలంచితినిగాని, యకారణంబుగ నిట్టి వి డబాటు ఘటింతువని యనుకొనలేదు.

ఉ॥ ఓనవ మోహనాంగి ! మన ♦ సొప్పనె నొంటిగనన్ను నిట్టులీ
కాననసీమవీడి చనఁ ♦ గా మరుసాయక బాధకోర్వఁగా
లేను నిజమ్ము నమ్ముమన ♦ లీల ననున్గలయంగరమ్ము, ఓ
మానిని ! జాలమేలగను ♦ మా యనుమానము మాని వెళమే॥

అయ్యో ! భూపాలపుత్రీ ! అకారణముగ నన్ను విడనాడి పలా

యనమగుట యుచితమే. లేక కాంతారసీమ నేకాంతముగా నుండు టంజేసి దురాత్ములే రైనను గొనిపోతిరా ?

శా॥ భూపాలా గ్రితనూజ ! యొంటిమెయినీ ♦ పోల్కి వసి జాలనే
నావ్వాయంగఁ గుతూహలంబెసఖ ! నీ♦ స్వాంతంబున,దొల్లినే
నేపాపంబొనరించినానొ యకటా ♦ యెట్లో ధ్రునిన్నాసిరా
వే పూఁబోణీ ! నిమేషమోర్వనయో ని ♦ న్నీవడన్గడున్భాగవరా॥

కాంతామణీ ! నిరంతరము హర్మ్యరాజంబునున్న సెజ్జపై నీ తోడి సుఖంబనుభవింపనున్న నాకీమార్గముఁజూపఁబాడియా,

వదః— (ప్రవేశించి తనలో) నేఁదలచినభంగి నన్ని కార్యములు శు భప్రదముగనే జరుగుచున్నవి. నేనెంత వేడికొనినను రత్నపు త్రిక నన్నొల్లదాయె. ఆపెంగలయు నుపాయ మరయఁజాలక చింతాక్రాంతుఁడనైతిని. దైవానుగ్రహంబున నెట్టకేలకీయు పాయము పొడగట్టె. అకటా తనఁగానన నీమనంతయు న్వెదకి వెదకి వేసారితినిగాని జయచంద్రుని జాడయే తెలియదయ్యె. నాయదృష్టము తిన్ననైనచో నీయటవి న్జయచంద్రుఁడగపడ కూడదా. (ఒకవైపుచూచి) ఆఁ ఆదిగో! రాకొమరుండెవ్వఁ డో యిందు వచ్చుచున్నవాఁడు. (కలయజూచి) వచ్చుటలే దు. వాపోవుచున్నట్లగు పడుచున్నది. నేనీచెట్టుమాటునఁడా గియుండి యాతని వృత్తాంతమొకింత యరసి, యనంతరము తగుకార్యమునకుం గడంగెద. (చెట్టుమాటునపొంచియుండి)

జయః— హారత్నపుత్రికా !

ఉ॥ నాడుస్వయంవరాన, నర ♦ నాథకుమారులఁ జారునూర్తుల
న్వీడి ధరాధిపుల్ మిగుల ♦ విస్మయమందఁగఁ బుష్పహారము
న్వేడుక నాదుకంఠమున ♦ వేయవెనీవు ? నఖీలలామ ! నీ
తోడికవీాద నేనుగన ♦ నోచితినో కనఁజాలనొకటా !॥

వదః— ఈతఁడు "హారత్నపుత్రికా" అని నుడివెగాన దప్పక జయ

చంద్రుఁడను నుక్క సందియము లేదు. సరియే యింకనూ విని యెదగాక.

జయ:— అయ్యో! ప్రాణేశ్వరీ! నీకై నిర్జరారణ్యంబులన్నియు వెదకి వెదకి తుదకు నిన్నుఁ గాంచలేనైతిని. నాపడిన ప్రయాసములన్నియు బూడిదెబోసిన పన్నీరు చందమున నిష్ప్రయోజనములయ్యె. ప్రాణములూడుచున్నయవి. ముందున కడుగు లిడినఁ దడబడుచున్నవి. నేటితో మనకిరువురకు సఖ్యము బాసెననుకొ నెయెద. (విచారముతో)

సీ॥ కోపమా నేజేయు • పాపమా లేక స
ల్లాపమా నాతోడ • నోపదంతి!
కాంచవా నన్నుద్ధ • రించవా యెంచవా
పొంచియుండనదేల • చంచలాక్షి!
డెందముఁ సందియం • బందనాయంబె నీ
పొందుఁగోరితి నేను • మందయాన!
ఏలనీలీలబల్ • కేళిసేసెదు బాల
తాళఁగాజాల భూ • పాల పుత్రి!

తే॥ గీ॥ చాలునెకసక్కెములవింక • నశ్వరమున
రమ్ము, ముద్దులగుమ్మ! ని • క్కమ్ముగాను
కోపమూనితో నాయెడ • కుందరదన!
నిలువఁజాలను నినువీడి • నిముషమైన॥

హా, రత్నపుత్రికా! హారత్నపుత్రికా!! నీయెడబాటునకే నెంత చింతిలుచుంటినే, అని (మూర్ఛిల్లును)

మద:— (పైకివచ్చి మూర్ఛిలియున్న జయచంద్రునిగని తనలో) డెందమునఁగల సందియము నివర్తితమయ్యె. జయచంద్రుఁడు మూర్ఛిలియున్నవాఁడు. వీనిగొనిపోయి కారాగారమున నుంచుట కిదియే యదను. అట్లుగావించితేని రత్నపుత్రిక మ

దీప్సిత మీడేర్చును. ఒకవేళ నియ్యకొనదేని రత్నపుత్రికా జయచంద్రుల నొకటి-మూరు ఖండించెద. (ప్రకాశముగా) భటులారా!

2=భటు:— (ప్రవేశించి) దేవరయానతి నతిక్రమింప మేమెంతటి వారము.

మద:— భటులారా! మూర్ఛిలియున్న రాకొమరుని బంధించి మన కారాగారమున నుంచుఁడు.

భటు:— దేవరయాజ్ఞ. (అని జయచంద్రుని బంధించుచుండ) జయచంద్రుఁడు మూర్ఛదేలి తనలో) వీరెవరోగాని నన్ను బంధించుటకుఁ గతమెద్ది? అడిగి తెలిసికొనియెదఁగాక. (ప్రకాశముగా) అయ్యలారా! నన్ను బట్టి బంధించుట కెద్దిగతము?

భటు:— మారాజుగారి యాజ్ఞ.

మద:— నుడువుట కిదియదను కాదు.

జయ:— అట్లయిన నకారణంబుగ బట్టి బంధించుట శూరలక్షణము కాదు.

మద:— శూరుఁడనో భీరుఁడనో మునుముందు తెలియఁగలదు.

జయ:— నిక్కవముగాఁ బిఱికిపంద వే.

మద:— ప్రలాపములఁ జాలింపుము.

జయ:— ఓరీ! యనృతవాదీ! హితబోధ లాలింపుము.

మద:— ఓరీ పేరిలరీ! మఱుమాట లాడకుము. తుదముట్టించెద.

జయ:— ఓరీ వాచాటా! తొలుదొల్తఁ గృతాంత నిశాంతుని కడకంపెద.

మ త్త॥ నన్ను బట్టిన యంతమాత్రము • నన్నుతూహలమేలరా
నిన్ననిన్వధియింతుబేర్వుల • నే ధరించెదదుర్మతీ!

మద:— ఓరీ జయచంద్రా! నీసతిఁ జెఱఁబట్టినవాఁడీ మదనుఁడే యనుకొనుము.

జయ:— (కోపాశ్చర్యములతో)
కన్నియంగొని వచ్చియిట్టుల • కారణంబుగ నెన్నియో

బన్నముల్ గుదువంగజేయఁగఁ • బాడిమేతలఁబోయఁగా॥
మద:— ఓరీ జయచంద్రా! పలుపలుకులేటికి. (భటులనవలోకించి, భటులారా! వీని గారాగారమున నుంచుడు.
(నిష్క్రమించును.)
భటు:— అయ్యా! మాతో దయసేయుఁడు. (త్రోడ్కొనిపోవుదురు)

(అవనికవ్రాలును.)



# తృతీయరంగము.

[ ప్రదేశము — కారాగారము. ]
(రత్నపుత్రిక కారాగారమున నుండగా, అవనికయెత్తఁబడును.)

రత్న:— (స్వగతము) హాపరమేశ్వరా! త్రిజగన్నివాసా! ఆపద్బాంధవా! కృపాంతరంగా! నిన్నేమని దూఱుదును. భక్తులయెడ నించుకంతయు గారుణ్యము జూపవైతివా! కృపానిధీ! నీవింతటి కాఠిన్యము వహింతువని కలనైనఁ దలంచనైతిని. భక్తచింతామణీ! నన్నీయాపదనుండి తొలగించి కాపాడుభారము నీయదికదా! భక్తవశంకరా! తొల్లి చక్రిహతినక్రశిరమున్నుమాడి గజేంద్రుని రక్షించలేదా. అనాథరక్షకా! నిండునభలోఁ బతివ్రతాశిరోమణి ద్రౌపది ధరించిన వలువలొలువ సమకట్టిన మదాంధుని దుశ్శాసనుని మురిపమడంచి మానహానివాటిల్లకే గావలేవా. పరంధామా! నన్నీదురాత్ముని బారినుండి తొలంగఁజేసి నామానముం గాపాడరమ్ము. (నాథునుద్దేశించి) హామనోనాయకా! అనన్యసామాన్య విక్రమ దురంధరా! తెఱ్ఱపాలచంద్రా! నాథా! నాయెడ నీకింతకినుకయేటికి. నీయెడ నేజేయు నపకారమెద్ది? లోకోత్తరగుణనిధివగు నీవదనారవింద దర్శనంబెటులబ్బుచు.

ప్రాణవల్లభా ! పాపాత్ముఁడగు నీమదనుఁడు కామాంధకారం
బున మన్నుమిన్నుఁగానక నిర్భయంబున నిర్దయుండై పరమ
సాధ్వినగు నన్నుఁబడయఁగోరి కారాగారమునందుంచి యెట్టి
యిక్కట్టుల నందఁజేయుచున్నవాఁడు అయ్యో ! యిద్దురా
త్మునకుఁ జిలుకకుంబోలె నేనెన్నియో విధంబులఁ బోధించిన
ను సద్వచనంబులఁ బెడచెవింబెట్టి నన్నిట్టియిక్కట్టుల నెట్టనె
ట్టుకొనియె. హామనోహరా ! ఈమందభాగ్యురాలనగు నాకు
మీ పదపంకజములసేవ యింకెన్నటికి లభించును.

ఉ॥ హాకరుణాకరా ! విబుధ ! • హాప్రియవల్లభ ! ప్రాణనాయకా!
హాకమనీయమూర్తి ! ప్రియ ! • హాసుగుణాకర! సత్యశీల! సు
శ్లోక ! దయాంతరంగ! ననుఁ•సుక్కఁగఁజేసెదు నిద్దురాత్మునిన్
నీకరవాలమున్దునిమి • నీయనుఁగుంజెలిఁగొంచుఁ బోవవే॥

హాజీవితేశ్వరా ! మిమ్ముఁగాంచకెట్లు జీవించుదాన. మీసాన్ని
ధ్యమునఁ జరించని నాజన్మమేల. ఇంక రత్నపుత్రికేడ. హామోహ
నాంగా ! మిమ్ముఁగూడి నిరంతరము సుఖింతుననుపేరాసనెంతయో
స్వాంతమునఁ జెందియుండ, భవద్దర్శనాభిలాషిణినైయున్న నాకు మీ
దివ్యదర్శన మందఁజేయరాదే. హృదయాంతర్గత వియోగానలంబెన్న
టికేనియు నంతమొందింతురా. (మదనునవలోకించి) ఓరీ దయాశూ
న్యా ! మదనా ! ఎంతకఠిన మానసుండవురా ! దయాదాక్షిణ్యంబు
ల విడనాడి నిర్భయంబుగా దుర్బలదుఃఖానలంబున నన్నుఁబడఁద్రోసి
నీవెంతటి యఘమార్జించితివిరా ! కటకటా ! నీమూలంబున నాప్రా
ణేశ్వరుఁ డెన్నివెతలఁ బాలయ్యెనోగదా. అకటా ! మార్గాయాసం
బునఁ బడలి భూరుహముదరి వసింపనేల ! వసించితిమిఁబో మాయాకు
రంగము మాకురంగటకురానేల ! వచ్చెఁబో మన్నాథుం డద్దానివెంట
నంటనేల ! వెంటనంటెఁబో మదనుఁడీ యక్రమమునకుం గడంగనేల!
అకటకటా ! చింతించినఁ గారియమేమి ! పూర్వజన్మకృతకర్మ ఫలం

బనుభవింపక దప్పునా! అయ్యయ్యో! యింకెన్ని సిలుగులమనుఁ గ
నానోగదా! (ఒకవైపుజూచి) అదిగో! మదనుఁడిటకే వచ్చుచున్న
వాఁడు. నన్నిప్పట్టున నాపద్బాంధవుఁడే రక్షించును.

మద:— (ప్రవేశించి తనలో) ఈమందయాన నాయందు మిగులనలు
కవహించియున్నది నేనెన్నివిధంబులఁ బ్రతిమాలుకొన్నను
నించుకేనియుఁ దయఁజూపదయ్యె. మఱియు మాటిమాటికి
దూఱుచున్నది. నేనిఁక తడవుఁజేసితినేని మనోవాంఛాఫల
సిద్ధుఁడనగుట సున్నయే. నేనీ చిలుకలకొలికి పలుకులకలిగి
సిలుగులఁ బడఁద్రోసియనెంచితినేని నీసుందరాంగి యసువులం
బాయును. అందులకు విపరీతముగాఁ బ్రవర్తించితినేని విఫల
మనోరథుండనగుదును. మంచిమాటలచే నీతరుణిఁ లోఁబ
ఱచుకొందునన్న నదియు జరుగదయ్యె. అయిన నింకొకమా
రు పలుకరించి చూచెదఁగాక. (ప్రకాశముగా) పద్మాక్షీ!
నీవునాయెడ నింతకాఠిన్యము వహింప నెందులకు?

రత్న:— (ఊరకుండును.)

మద:— సుందరాంగి! పిలిచినను బలుకవేమి?

రత్న:— (స్వగతము) ఈమదాంధుఁ డించుకంతయుఁ గనికరమూన
క తాఁబట్టినపట్టు విడువకున్నవాఁడు. (ప్రకాశముగా) ఓరీ
నీచమానవాధమా! ప్రాణంబులపైఁ బ్రీతిగలదేని రయంబ
మఱలిపొమ్ము.

మద:— తరళాక్షీ! మానవజన్మమెత్తినందులకు నినుఁబోలుమందయా
నలఁజేబట్టి మదనసామ్రాజ్యమేలుటయేగదా సౌభాగ్యవహము.

రత్న:— (కోపముతో) ఓరీ మానవాధమా!

ఉ॥ దుందుడుకింతగాఁదగునె? • దోచదె ఘోరయఘంబటంచుఁగా,
మాంధతఁ గన్నుగానవహహా • యిఁకనేనియు సత్ప్రవర్తనం
బందు మెలంగు మోఖల! పరాంగనఁ జేకొన నూహవీడుమా
అందనిమ్రానిపండ్లకయి • నాసవహించినఁ గార్యమున్నదే॥

మద:— కంజాక్షీ ! నీకటాక్షవీక్షణంబుల న్నావయిఁ బరపక కారణం బుగా దురోక్తులాడం జెల్లునే.

ఉ॥ ఓయొలనాగ ! నీహొయలుహో, సుకుమారత, సోయగంబు, లేఁ
బ్రాయపుతీరు వెండిమ్మగ రాజుహసించెను కొన్నఁగాంచఁగఁ
బాయఁగనిచ్చుబుట్టునొకొ ?బలుకుమఁ కాగ్రహమేల?మన్మథా
ఖ్యాయుఁడ గేళిఁదేల్పుము నఁహార్నిశమున్దయ బూనుటొప్పదే॥

అన్నులమిన్నా ! ఈదాసునియెడ నీవింతకాఠిన్యము వహింపఁ జెల్లునా. ఇఁకనేనియు నాపలుకులాలకించి మదనసామ్రాజ్యంబున నాకుఁ దోడునీడయి యుండుము. నావాంఛిత మీడేర్తువేని నీకోరిన దొసంగెద. నారాజ్యమంతయు ధారవోసెద. నీపదదాసుఁడనై యుండనుండెద.

రత్న:— ఓరీ మదాంధా ! కాఱులరచినఁ గారియమేమి ? అవలకుఁ బొమ్ము.

మద:— సుందరీ ! ఎకసకెకెములఁ జేయుచుంటివా ?

రత్న:— కామాంధులకన్నియు నట్లులనే దోచును.

మద:— దానికేమిలే. నావాంఛిత మీడేర్తువా !

రత్న:— పాపాత్మా ! ప్రాణంబులపైఁ దీపిగలదేని నికేతనమున కేగుము.

మద:— ఓసీ మాయలాడీ ! ఊరకొన్నకొలంది బలుకుల మిగుల నాడుచున్నదానవు.

రత్న:— నీదగు నీచకృత్యంబునకుం దగిన ఫలంబునుకొనుము.

మద:— (కోపముతో) ఏమీ నిక్కువమేనా ?

రత్న:— ముమ్మాటికి నిక్కువమే. దురోక్తుల మానికొమ్ము.

మద:— (కోపముతో) నిన్నిప్పట్టున నంత ముండించిన నేమి చేయఁ గలవు.

రత్న:— పౌరుషహీనుఁడవని యనుకొనిరమెడ.

మద:— పౌరుషమునసే గొనివచ్చితి.
రత్న:— చాలు నీపౌరుషము. వీరుఁడవేయయినచో మన్నాథునితో నాహవమునకుం దలపడి విక్రమంబులఁ జూపియుందువు.
మద:— (తనలో) ఈమగువనుడివిన వాకులందసృత యిసుమంత యులేదు. ఏమని నుత్తరువిచ్చెద. (ప్రకాశముగా) భాను రాంగీ! అనవసరప్రసంగమేల నిన్నిటనుండి కదులనీయను. రమ్ము. కౌగిలిమ్ము. (అని దరిజేరఁబోవును.)
రత్న:— (కొంచెముదూరముగ జరిగి కోపముతో)

## మత్తకోకిల వృత్తములు.

ఓరిదుర్మతి! యీకువాక్యము ♦ లోప్పవింకఁ దొలంగుమా
మద:—మారుబారికి నోర్వఁజాలను ♦ మానినీ ననుగూడుమా
రత్న:—కారుకూతలుమానుమీ పర ♦ కాంతగోరఁగ బాడియా
మద:—చారులోచన! నన్నుగూడఁగ ♦ జాగొనర్చెదవేటికే.
రత్న:—పాపిమానవ! దుర్మదంబునఁ♦బల్కబాడియె? యీక్రియ
మద:—కోపమూనగ నేలబాలరొ! ♦ కోర్కెదీర్పుము వేళమే
రత్న:—రాపుసేయగ నేలబొమ్మ్రబి ♦ రానవచ్చిన త్రోవనే
మద:—పాపిమారుని క్రూరసాయక ♦ పంక్తికోర్వగఁజాలనే॥

రత్న:— అన్నా! పరస్త్రీగమనము పాపహేతువుగదా?
మద:— కాదు.
రత్న:— ఎందువలన?
మద:— మనోవాంఛ తీరుటెట్లు?
రత్న:— నిజభార్యాలోలుఁడవై యుండుము.
మద:— తావలచిన మగువలందఱూ నిజభార్యలుగానే పరిగణింపఁబడుదురు.
రత్న:— నీసతిన్పరుఁడు గోరినప్పు డట్టులనే పరిగణింతువా.
మద:— (కోపముతో) ఓసీ! నోరుమూయుము.

రత్నా:— మదాంధా! నీనోరుమూయించుటకే యిందొచ్చితిని.
మద:— అటనా! ఇకనీగతి యెవ్వరో చూచుకొనుము.
రత్నా:— జీవితేశ్వరుఁడే.
మద:— ఉండినగదా.
రత్నా:— లేకేమి.
మద:— అవును. చెరసాలలో. సందియమేమి.
రత్నా:— మేలునకే వచ్చినది.
మద:— కుందరదనా! నీయందనుండ ననుజ్ఞనీయ గోరెద.
రత్నా:— ఓరీ మదాంధా! మాటలజాలించి యావలకుఁ బొమ్ము.
మద:— ఇందువదనా! నీపొందుఁగోరి వచ్చినందులకిదియా ప్రత్యుత్తరము. నీవలన్జిక్కిన నేనావలకు బోవుటెట్లగు.

మానినీ వృత్తము.

మానిని! నీయనుమానము మానుము • మారుశరీరుఁ డనన్ననుమా
సూనశరాగ్నికిఁ దాళనుజేర్పుము • సుందరి నీభుజపంజరముఁ

రత్నా:— (స్వగతము) ఇద్దురాత్ముం డంతకంతకుఁ దుర్లిపడుచున్నవాఁడు. (ప్రకాశముగా) ఓరీ పాపాత్మా!

మానవతిఁ ననుఁగోరఁగఁబాడియె • మానుముఁనీదగు దుందుడుకుల్
లేనిచో మత్ప్రియుఁడాజినిగూల్చును • లెమ్ము వడిన్మదినారయుమా॥

మద:— బాలా! యీలీలఁ గోపమందనేల. మదనుని పూవుటమ్ముల కులోనై సురిక్కుచున్న నన్ను విరహాగ్నినుండి తొలఁగింపు భారము నీయది. కాన పరిపరిభంగుల వేడుచున్నవాఁడను. శాంతమూని కాంతుని శరసంగంబులకులోనై వంతనొందియున్న నాస్వాంతంబున కిసుమంత హాయినొసంగుము,
రత్నా:— ఓరీ పాపాత్మా! కారులరవకుము.
మద:— భాసురాంగీ! మదీప్సిత మీడేర్పుము.

విచిత్రవృత్తము॥ మనోనాథుగాన • న్గనన్నెల్లునింతీ
వనుగ్గాడవేని • అనిన్గూల్తువాని॥

రత్న:— ఓరీ దురాత్మా! నీవు నామనోహరుని గూల్చుటకల్లగాని యతనిచే నీవు నేలఁగూలుట సత్యము. ముమ్మాటికిసత్యము.

మద:— (చిఱునగవుతో) అబ్బా! ఏమి వానిసాహసము. బలాబలంబులాహావ రంగంబునఁ దెలియకపోవుతే.

రత్న:— ఓరీ! నీవొకశూరుఁడవే యైతివేని నాతనితో సమ్మరము నకుం గడఁగి యుగ్రరమున జయమందియే యుందువు. కాంతారమున నేకాంతముగానున్న పరకాంతను దనకెఱవ్వ త్రిన్గో నివచ్చుట యేటిమగంటివి. పిఱికిపందవనుట కిదియే తార్కాణము.

మద:— (మందహాసము) సుందరీ! ఏకసకెఱములఁ జేయుచుంటివి కాఁబోలు. కలికీ! నీపలుకులు లెక్కసేతునా.

—• పాట •—

రావెసఖి! మరుబారి కోర్వఁగజాల

రత్న:—ఓరిఖల! పరనారి గోరఁగనేల

మద:—సుందరీ! తాళజాలపొందుము నన్నీవేళ॥రావె॥

రత్న:—చాలును పలుకులేల జాలమదేలకూళ॥ఓరి॥

మద:—ఓసుదతీ! నిన్నువీడి నేనిలువజాల నొకటినిముషమైనఁ
మదనుఁడే యుసుసిశితశర పంక్తికోర్వజాల॥రావె॥

రత్న:—ఓతులువా! ధర్మమెంచ కిట్లనగ నాయమొగ్గొవడిదెల్పుమా
తొలగుమింక పలుపలుకులతో బ్రయోజనంబా॥ఓరి॥

మద:— మోహనాంగీ! నేనెన్నిభంగులఁ బ్రతిమాలుకొన్నను నా మనోరథం బీడేర్పవేఁదులకు?

శా॥ కాంతా! సిగ్గిలనేల నీకిర్యను లో • కంబంధునన్ లేవెయీ

వింతల్గావున నీమనాత్మ నికనీ ♦ వెత్రిన్గన్నీడినా
పొంతన్జేరి సుఖాబ్ధిఁదేల్పుమువడిన్ ♦ బూవిల్తుబాధన్గనన్
ఎంతోచింతిలుచుంటి హంసగమనా! ♦ యెబ్భంగి సైరించెదన్॥

రత్న:— ఓరీ తులువా! క్షత్రియవంశపాంశనా!

మ॥ తులువా! తుళ్ళిపడంగ నేటికనిలోఁ ♦ దూలెన్గదా రావణుం
డల శ్రీరామునిశాతసాయకము మో ♦ హాంధాఖలా! గానని
విల నన్యాంగనలన్ హరింపకుము నీ ♦ వెంచంగనే లేరిచోన్
బ్రళయాంభోనిధిభంగి మత్ప్రియుఁడు వ ♦ క్త్రింబున్ధరన్గూల్చురా॥

ఓహోరీ యధర్మపరాయణా! నన్నుగ్గోర నీబోంట్లకుఁ దగునఁటరా. నన్ను స్వాంతింప నొంచినంతమాత్రమున నీకు లోనగుదునని తలంచితివి కాఁబోలు. మానవతికిఁ బ్రాణముకన్న మానమే వేయిరెట్లధికము. ప్రాణనాశనము సరియే. మానహానికి నియ్యకొందునా. వట్టికల్ల. ఇంతియె కాక నేను సాధ్వీమణిని. పతివ్రతలకసాధ్యమైన కార్యంబులీరేడు లోకంబులందును గానరావు. బలాత్కృతిన్ నన్ను వరింపనుంటివేని నదెన్నటికిని జరుగదు. మఱియు నన్నులోఁబరచుకొనుట నీతరముగాదు. అదట్లుండనిమ్ము. ఓరీ మూఢమతీ! పతివ్రతను జెఱపసమకట్టి నీబోంట్లెందరో వసుంధర న్మడియలేదు. నీకును నాగతియే సంభవమగును.

సీ॥ పరకాంతమదిఁగోరి ♦ సురవైరియాజిలో
సర్వస్వమును వీడి ♦ చావలేదె,
పరనారిఁగోరి ని ♦ ర్జరపతి సూనుండు
నిశితశరంబున ♦ నీల్గలేదె
పరభామఁదలపోసి ♦ కౌరవేశుండాజి
ననుజశతంబుతో ♦ హతముకాడె
పరరామమదినెంచి ♦ ధరసింహబలుఁడు దా

మల్లయుద్ధంబున ♦ మడియలేదె.

తే॥ గీ॥ వేయివచియింపఁ బనియేమి ♦ వేనవేలు
మడసి నారలుగాన దు ♦ ర్మదమువీడి
ధర్మవృత్తిఁ జరింపుము ♦ తథ్యమిావు
అన్యకాంతలఁ గోరంగ ♦ నరయుఁబోకు

మద:— బాలా! వృథాప్రలాపములేల! కామాతురులకు హితోప
దేశములవలని లాభమించుకంతయు లేదు.

మ నో ర ం జ ని.

కలికిరో! కోపముఁదొలగఁగఁ జేయుము ♦ కౌగిలిజేరుముమారుఁడమో
అలుఁగులచే నను బరిపరిభంగుల ♦ ప్రాణములన్ హరియించెఁగదే

రత్న:—

తొలఁగుఁము వైళమె తులువతనంబును ♦ దోృయుమిఁకావలకుష్ఖలుఁడా
నిలువకుమియ్యెడ నసువులబాసెదు ♦ నిక్కముసీమది నమ్మనగున్॥

మద:— సుదతీ! నీపట్టినపట్టు విడువకుంటివిగదా. నీపొందుఁగోరివచ్చి
నందులకు కొంకమారు నీదమూరసముఁ జిల్కి నన్నానందాబ్ధినో
లలాడింపుము.

రత్న:— (స్వగతము) శిష్టురాత్ముఁనకుఁ జెడుకాలమాసన్నమయినది
కాఁబోలు. (ప్రకాశముగా) ఓరీ పాపాత్మా! ఏటికీప్రలాప
ములు. నీప్రాణంబులపై నాశగలదేని రయమున నరుగుము.
లేదేని మత్ప్రియునిచేఁ జచ్చెదవు.

మద:— (కోపముతో) ఓసీ మాయలాడి! ఊరకొన్నకొలంది నో
టికివచ్చిన పగిదిఁ బ్రేలుచున్నదావు. ఇంతదనుక నబలవని
మెంచి యూరకుంటిని. నీకఠినోక్తులనాలకింపఁ గోపానల మధి

కమగుచున్నది. కొండియుఁ బరాంగనల నభిలషించి నేన వేలు
మడసితిరని వక్కాణించితివి. నీమనోహరుఁడు నన్నుంగూల్చు
గా. మునుముందుగఁ గారాగారమున నుంచిన నీప్రాణనాయ
కుని నిటకురప్పించి నీవుకాంచుచుండఁగనే శిరచ్ఛేదముఁగావిం
చి యనంతరము నిన్ను బడసెదఁగాక. (ఒకవంకదిరిగి) ఎవఁడు
రా! అక్కడ.

సేవ:— (ప్రవేశించి) మహాప్రభో! ఏమిసెలవు.

మద:— ఓరీ సేవకా! కారాగారమున నుంపఁబడిన జయచంద్రుని
త్వరితగతి నిద్దోడ్కొనిరమ్ము. పొమ్ము.

సేవ:— మహాప్రసాదము. (నిష్క్రమించును)

రత్న:— (స్వగతము) అయ్యో! ఈమూర్ఖుఁడెంతటి ద్రోహమున
కొడిగట్టుకొనినాఁడు. నన్ను బందిగమున నుంచుటయేగాక మ
న్మనోహరునిఁగూడా కారాగారప్రాప్తుం జేసినాడే. ఎంతటి
ఘోరకృత్యము. మనోనాయకుఁడీ యధమాధమున కెవ్విధి
చే జిక్కెనో తెలియరాదయ్యె అనన్యసామాన్య విక్రమ
ధురంధరుఁడని బిరుదమందిన మత్ప్రియుఁడీ పాపాత్మునకులో
నయ్యెనా. మాయోపాయంబునఁ బట్టె యుండనోపు. మగ
టిమిన్నాపి గండారునందుంచుటకల్ల.

మద:— అబలామణీ! ఇఁకనైనను మదీప్సిద మీడేర్చెదవా?

రత్న:— ఇంచుకసేపూరుకొనుము. నీవాంఛిత మీడేరఁగలదు.

మద:— ఎట్లు?

రత్న:— చంద్రహాసము కతమున.

మద:— బాలామణీ! పలుకులతో నేమిప్రయోజనము.

సేవ:— (జయచంద్రునితోఁ బ్రవేశించును.)

మద:— ఓరీ జయచంద్రా! నేనెవ్వఁడనో తెలిసినదా.

జయ:— పిఱికిపందవని మనమున దలఁచితిని. (పరిహసించును.)

మద:— ఓహో! పిఱికిపందనుగా. నాచేజిక్కిన నీవిఁక నెటకేగఁ
గలవు. ఈ వాకరవాలంబున శిరమ్ముఖండించెద.

జయ:— మందమతీ! చేతులకు గాజులు తొడిగించుకొని యుంటిన నుకొంటివా? నీచపుంబని కొడంబడి మూర్ఛిలియున్న నవసరం బున నధర్మమని యెంచకయే పట్టి బంధించి కారాగృహము ననుంచినందులకు రవంతయు స్వాంతమున సిగ్గులక మా బలంబు జూపవచ్చితివా. చాలుచాలు నీమగంటిమి. పౌరుష హీనుఁడవని నొక్కి వక్కాణించఁగలను

మద:— ఓరీ జయచంద్రా! కారాగారవాసము లభించినందులకు సిగ్గుంజెందక నన్ను మిగులఁ దూలనాడుచున్నావుగా.

జయ:— ఓరీమదనా! అధర్మపరాయణా! ఇది క్షాత్రధర్మమే యగునా?

మద:— ఆనవసరప్రసంగముతోఁ బనియేమి. సమరంబున కియ్య కొనెదవా.

జయ:— యుద్ధసన్నద్ధుఁడనై యున్నవాఁడను.

రత్న:— (స్వగతము) ప్రాణేశ్వరుఁడు రణోత్సాహియై యున్నవాఁ డు. సమరరంగమున మదనుఁడు నిమేషమాత్రమున మడి యగలఁడు. మదనుడెప్పుడు నేలఁగూలునాయనియు, మన్నా థుండెప్పుడు నన్ను జేకొనునా యనియు మానసముత్తరపడు చున్నది. అయిన నేమిజరుగునో చూచుచుండెద.

మద:— ఓరీ జయచంద్రా! సుఖంబుగనుండఁ గోరెదవేని నీకాంత పై మోహంబు విడనాడి మరలిపొమ్ము. బంధవిముక్తునిగా నొనరించెద.

జయ:— (కోపోద్దీపితుఁడై) ఓరీమదనా! పరాంగన నభిలషించిన నిన్నిప్పుట్టున ఖండలుఖండలుకావించి కాకంబులకెగరవైచెద.

రత్న:— (స్వగతము) ఈమదనునకు వినాశకాలము దాపరించినది.)

జయ:—

శా॥ ఇంతుల్గారు కటంగట న్మొలగు చెం • తేనింపుగా నాడఁగా
వంతన్గొల్పెడు మార్గణమ్ములు జుమా • వంతైన డెందంబునన్

జింతన్నెందవు నీదుప్రాణములకై • ఛీ ! ఛీ! దురాత్మా! నిన్నుఁ
సంతోషంబున గూల్చివైచెదనిదే • సంగ్రామరంగంబునన్ ॥

మద:— (కోపముతో) ఓరీ జయచంద్రా! పలుకుల మిగులనాడక కడసారి పరమేశ్వరుని వేడికొనుము.

జయ:— తొలుదొల్త నీయసువులన్నదియు కరవాలమున కాహుతినొనర్చి యనంతరము జగదీశునిఁ బ్రార్థించెద.

రత్న:— (స్వగతము) మన్మనోవాంఛితమునకు దగునుత్తరవొసంగె.

మద:— (కోపముతో) ఓరీ మదోన్మత్తా! వ్యర్థప్రలాపములవలని కార్యమేమి? జయాపజయంబులొక నిమేషమాత్రమునఁ దెలియఁగలవు.

జయ:— ఓరీ మదనా! నిను నడఁగించుటకే యిందరుదెంచితి. బంధవిముక్తుఁడ గాఁజాలనని యనుకొనకుము.

మద:— (కోపముతో) ఓరీ చంద్రా! ఇదిగో! ప్రాణంబులఁగాచికొమ్ము. (అని నరుకఁబోవును.)

జయ:— (తప్పించుకొని కాలితో నొకతాపు దన్నును.)

మద:— (నేలంబడి మఱలలేచి) ఓరీ! ఇఁకనెంతదూరమేఁగువాఁడవు. (అని మఱల జంపనుంకించును.)

తెరలో

ఉ॥ క్షత్రియవంశసంభవుఁడ • శాత్రవభీముఁడ ధాత్రిపూతచా
రిత్రుఁడ, దండనుండ నర • రేకనుఁ గానవు సచ్చరిత్రమి
త్రుని గూలనేయనర • మే కుమతీ! పరకాంతఁగోరియీ
కృత్రిమ మార్గముజ్జనుట • కీర్తికిలోపముగాదె యెంచగాన్ ॥

మద:— (అబ్బురపాటుతో) ఏమిది? ఎవ్వఁడోగాని యొడలెఱుఁగక కూయుచు నిటకేవచ్చుచున్నవాఁడు. వచ్చిననేమి. యమునిసభాస్థలం బలంకరింపంజేసెదఁగాక.

జయ:— (ఆలకించి తనలో) అదిగో! నామిత్రుఁడు ముకుందుఁడు వడివడి యడుగులిడుచు గరవాలంబుఁగొని వచ్చుచున్నవాఁడు.

ముకు:— (వడివడిగా బ్రవేశించి మదనుని కరంబుఁబట్టుకొని)

—: పాట :—

ఖలువా! తగునె౦యిట్లుదలఁపఁగ ♦ నానే స్తముగూల్పనుంటి వహాహా
ఈఖండంబున నిన్నుగూల్చెదను ♦ ఎందుబోయెదవు జెపుమా
సమరరంగమున నీదుశిరంబది ♦ సత్వరంబు దెగు వినుమా ॥ఖ॥
నీప్రాణాల్పాయి నాశపీడుమిఁక ♦ నీచకృత్యమది తగునా
పరునిభార్యనీరూపుదలంచుట ♦ భావ్యమౌనె వడిజెపుమా ॥ఖ॥

మద:— (కోపాశ్చర్యంబులతో తనలో) ఈతఁడెవ్వఁడై యుండనోపు. నన్నుబట్టుటకుఁ గతమెద్ది! మఱియు నితనిపలుకుల వలన జయచంద్రుఁడీతనికి సంగడీఁడనుటకు సందియము లేదు. లేనిచో నాపలెనే యితఁడును నీయింకువదన పొందుఁగోరి, వచ్చియుండునా? కాదుకాదు. జయచంద్రుని యనుంగుఁ జెలికాఁడె. అయిననేమి యిప్పటున మదీయ ఘోరకరవాలంబున శిరంబెగురవైచెద. (ప్రకాశముగా) ఓరోరీ మదోన్మత్తా! నుపఖ వాదంబున కేల గడంగెదవు.

ఉ॥ చూపెదఁగాక మద్బలము ♦ చూపరులెల్లరు సంతసింపఁగాఁ
బాపెదనీదుప్రాణములు ♦ బన్నరుపేరులుటి కేటికోరి ఛీ!
పాపి! యనేకమందునను ♦ బాఱగదోలెదు వాఁడవీవ?! యీ
చాపమువేచియున్నయది ♦ చంపగనిన్ రణరంగమందునన్॥

ముకు:— ఓరీ కలుషాత్మా!

శా॥ ఓరీనీచమతీ! దురాత్మ! కుమతీ! ♦ మోహీకులద్వేషి! మో
రోరి క్షత్రియవంశపాంశన!గుణు ♦ ద్రోహీ! మదాంధా! ఖలా!

ఓరీక్రూర! పరాంగనారతి దుర • ద్యోగంబటంచు న్మహా
ఘోరంబౌనఘమబ్బునంచరయకే • గూడం దలంపాసితే॥

ఓరీ దుష్క్రియాభినిరతా! కుమతీ! నీచకృత్యంబునకేల గడం గితివిరా కలుషాత్మా! కారుణికత్వ ముక్కంఠయుగనక తులువతనం బున న్పతివ్రతాశిరోమణియగు నాయనుంగుసఖుని భార్యంగోరసాహ సించితివిగా.

సీ॥ అర్ధాంగిదరి నప • హాస్యమాడుటగాదు
చావఁజంపెను శత్రు • చయముఁగాని
కాంతలపొంత నే • కాంతమాడుటగాదు
గుండెకాయల నఱ • కుటయెగాని
బలహీనుఁజడగొట్టి • బాధించుటయుఁగాదు
గర్వంబడంచు మొ • గ్గరముగాని
తల్లిదండ్రులచెంత • దాంభికంబులుగావు
కరవాలమున నేర్పు • గనుటగాని
తే॥ గీ॥ పిన్నవాఁడను మాటలఁ • బెద్దనగుదు
నావహంబున, గానవో • యధమ! యింక
మాటలేటికి, రారమ్ము • మదమడంతు
వేయువచియింపనేటికి వేగరమ్ము॥

ఓరీ యవివేకీ! ఈము కుందుని కఁఠంబునఁ బ్రాణమున్నంతద నుక తలఁచిన కార్యమీడేరునని యనుకొనకుము. పొందియు నసువు ల్పెనాశగలదేని మలినాత్మనమలినాత్మగాఁ జేసికొనుము. లేని చో ఘోర కారముంగలిగి విషజ్వాలలంగ్రక్కు. మదీయ కరవాలం బున శిరఃబంతఱింపెద. (అని పరనుండి కత్తిదీయును.)

మ. ద.— ఓరీ ముకుందా! నీనుడుల కమితానంద పరవశుఁడనైతి. చాలుఁజాలు. ప్రగల్భముల కేమి. జీవము మైనుండ నీవాంఛి తమీడేరనిత్తునా యనుటకు నోరెట్లాడెనురా.

చ. పరిపరిఁగూయనేల పశు ♦ వా! పసిబాలుఁడవంచునెంచియీ
సరికిని నూఱకుంటిని వి ♦ చారముకింతయు లేదునీకయా
గరుణనుజూపరాదు కల ♦ కాలము నీప్రియమిత్రులేడ్వన
త్వరమున ధారుణీస్థలిం గ ♦ పాలము వ్రక్కలుసేతు డింభకా॥

ముకు:— మణిగణ నికరము.

గరువము నణంచెద ♦ గనుగొనుమిప్పుడే
పరతిరుగులు, ఖలు, బడయఁగలఁగఁగనా
పరిపరివిధములఁ ♦ బలిమిత్రి పిడిమిా
మఱియిక నిలిచిన ♦ మడసెగవనిలో॥

మద:— (కోపోద్దీపితుఁడై) ఓరీ దుర్మదాంధా!

— పాట. —

ఓరి ఖలుఁడ! నిముసము నిటనిలువుము యిఁదో ♦ యరయగయము
గనబరచెద తాళురా॥

ముకు:— ఓరికుమతి! మనము నగలఁ గరువమునని ♦ శిరముధరణి
నెగురఁగొడుదు గాచుకో॥

మద:— తగనిపలుక్కులిచటబలుకి ♦ దలపనేమిగల్గురా.

ముకు:— తలకుమించు పలుకులాడ ♦ దగునెనీకుదుర్మతీ.

మద:— ఓరీముకుందా! ఇఁక నెట కేగెదవు. కాచికొమ్ము. (అని
నరకబోవును.)

ముకు:— (తప్పించుకొని ముష్టిఘాతంబున నేలపడఁగొట్టి, చటాలు
న వానిగుండెపై గూర్చుండి) ఓరీ సజ్జనద్రోహా! ప్రతిజ్ఞా
భంగపరిహారకా! యవివేకీ! ఇక నెంతదూరము మేగెదవురా ?
క్రూరా! వృధాలాపములతోఁ బ్రయోజనమేమి? కళ్యాణ
పురాధీశ్వరాగ్రజుని పరాక్రమిప్పటికైనఁ గనిపెట్టితివా. ప
తివ్రతాశిరోమణియగు రత్నపుత్రికం జెఱపట్టిన ఫలంబిత్య
దియే యని గ్రహింపుము. నేఁడు నా ముష్టిఘాతంబునఁ బ్రా
ణములఁగొనెద. (అని గుద్దఁబోవును.)

మద:— హా! హాతోస్మి! హాతోస్మి!!

ముకు:— ఓరీ మదనా! నిన్నుంగనుంగొన నాకు జాలియగుచున్నది.
కావున బలియింపక కొన్నిదినంబులు దనుక బందిగమున
నుంచెద.

జయ:— (సంతోషముతో) మిత్రమా! మనమిప్పట్టున జంధనాపు
రమేగవలయు. మదనుని మనతోఁ గొనిపోవుదము.

[అని నిష్క్రమింతురు.]

(అవనిక వ్రాలును)



శ్రీ రామచంద్రాయనమః

# రత్నపుత్రికావిజయచంద్రీయము

పంచమాంకము — ప్రథమరంగము

[చంద్రశేఖరుని మందిరము.]

చంద్రశేఖరుఁడు, చంద్రవదన ప్రవేశింతురు. ]

చంద్ర:— (విచారముతో) మోహనాంగీ! తనూభవుం డింతదనుక రాకయుండుటకుఁ గతంబేదియో యుండును.

చంద్రవ:— ప్రాణేశ్వరా! నాకును సందియమగుచున్నది.

చంద్ర:— ప్రాణేశ్వరీ! నా యంతరంగ మంతకంతకు దుఃఖాక్రాంతమై తల్లడిల్లుచున్నది.

ఉ॥ చాలదినంబులాయెఁ జని ♦ సర్వగుణోత్తముఁడౌ తనూభవుం
డేలొకొ రాకయుండెఁ? గత ♦ మెయ్యదొ? ఘోరవనాంతరంబు
నన్నాలఁ గడన్నినాఁడొ! మృగ ♦ సంతతిచే గటకీడుగల్గెనో
బాలునిజాడ నేరనికఁ ♦ బ్రాణముతో నెటులుందుఁ జేయసీ॥

సీ॥ అలరువిల్తుని నైన ♦ హాసియింపఁ జాలువాని
గన్నకుమారునిఁ ♦ గాంచు టెపుడొ
కమనీయగుణధాము ♦ గంజాతలోచను
గన్నకుమారునిఁ ♦ గాంచు టెపుడొ
సరసవాక్యామృత ♦ సారంబు జిల్కెడు
గన్నకుమారునిఁ ♦ గాంచు టెపుడొ
ముద మొదవఁ బూర్ణేందు ♦ మోహనాకారుని
గన్నకుమారునిఁ ♦ గాంచు టెపుడొ

తే॥ గీ॥ ఏడకేగెనో ? జాడనో ◆ కింతమైనఁ
గానఁ బడకున్నదక్కటా ◆

చంద్రవ: ..................... కాలవశము
ఇట్టులుండఁగ మదిగుంద ◆ నేమిఫలము
బ్రహ్మ వ్రాసిన దద్దరమాన ◆ పార్థివేంద్ర॥

చంద్ర:— మనోహరీ !

ఉ॥ చిన్ని కుమారుఁ డబ్జకుల ◆ శేఖరుఁడాహవభీకరుండు వి
ద్యోన్నతిఁగన్నవాఁడు సుగుణోజ్జ్వలపూరుషసింహుఁడున్నఁడుగా
సన్నుతశీలుఁడారయఁగ ◆ సత్యమే నిత్యము నెన్నువాఁడునా
కన్నకుమారుఁ డేపగిది ◆ గాంచెదువాఁడనో ప్రాణనాయకీ ॥

అబ్జాక్షీ ! తే॥ గీ॥ పెద్దకాలంబు సుతునికై ◆ పెక్కుదుమల
వడసి యెట్టకేలకుముని ◆ వరుని కృపను
బడసినారము తనయుని ◆ భాగ్యమేమొ
యింటలేకుండ నెచ్చట ◆ కేగినాఁడొ॥

చంద్రవ:— భూపాలచంద్రా ! మీ పలుకులాలకింప నామానసమెక్కతంబున నోగాని కరిగినీరగుచున్నది. (విచారమభినయించును.)

చంద్ర:— కురంగలోచనా ! యనంగునిగెలిచేయు ననుంగుతనయుం గనుంగొనఁ జాలకుందుమా. మనఃక్లేశము విడనాడుము.

తే॥ గీ॥ ఓ మనోహరి ! వాపోయ ◆ నేమిగల్గు
గొద్దిదినములు సైచిన ◆ ముద్దుసుతుని
గన్నులారఁగఁగాంతుము ◆ గానికాల
వశమునకునేమిచేయఁగా ◆ వలయుఁజెప్పుఁడీ॥

చంద్రవ:— నాథా ! మీ నుడులయందనృత మిసుమంతయు లేదు.

నామనఃక్లేశ మింతటితో నంత మొందునదియుఁగాదు. ఆత్మ
జుని వాఁడెలఁ జూచునంతవఱకు నిట్టులనేకాలము బుచ్చనగు
నని యనుకొనియెద.

చంద్రి:— దేవీ! ఎవ్వరయినను గష్టకాలంబునఁ గోర్చి నిలుచువారలే
ధన్యులని కోవిదులు వాక్రుచ్చితిరిగదా. మఱియు నాదక్షి
ణపార్శ్వమంతయు పెల్లదురజొచ్చె. ఇదియునొక శుభసూ
చనయేగదా.

భటు:— (ప్రవేశించి) మహాప్రభో! యువరాజుగారువచ్చుచున్నారు.

చంద్రిక:— నాథా! శుభవార్తఁ గొనివచ్చిన యీప్రతిహారికి మౌ
క్తికహారమొసంగెద. (భటునింగాంచి) ఓరీ సేవకా! ఇదిగో
యీహారమం గొనుము. (అని యొసఁగును.)
భటు:— (చేకొని యొకప్రక్క నిలువంబడును.)

{ జయచంద్రుఁడు, రత్నపుత్రిక, ముకుందుఁడు ప్రవేశించి
రాజదంపతులకు వందనములాచరించి దీవనలఁ గైకొని
యనంతరము నియమితాసనంబు లలంకరింతురు. }

చంద్రి:— తనయా!

కం॥ ఇంతతడ వీవులేమిని
చింతాక్రాంతుండనైతిఁ • జిన్నికుమారా!
సంతసమందితి నిన్గని
సంతసనె, నీకెంతోఁ జేసు • మానందమునన్॥

జయ:— జనకా!

కం॥ జనకా! యీ పెవిజయసే
నునియాత్మజ! వెండినాము • నోహరిగానన్
గనుమతిముదమున నిచ్చలు
జననిమదిన్ సంతసింప • త్న్మమండలిలోన్॥

చంద్రవ:— కుమారా ! ఇన్ని దినంబు లెచ్చోటనుంటివి ?

జయ:— జనయిత్రీ ! నాచారిత్రమనంతరము వినిపించెద.

చంద్ర:— జయచంద్రా ! నీవెంటనున్న రాకుమారుఁ డెవ్వఁడు ?

జయ:— జనకా ! ఈతఁడు కళ్యాణపుర నృపాలాత్ముజుడు వెండియు నాకునుంగుఁ జెలికాఁడు. నాయసువులం గాపాడిన మహనీయుఁడు.

ముకు:— మిత్రమా జయచంద్రా ! నన్నెటికేఁ బరిపరివిధంబులఁ గొనియాడువాఁడవు. నేనొనరించిన యుపకృతిం దిసుమంతయు లేదు. దైవానుగ్రహంబున గష్టంబులఁ బాసి బయటబడితిమి.

జయ:— అంతయుఁ దైవాధీనమనియే నెఱుంగకపోలేదు. ఆపత్సమయంబునఁ గాపాడిన మహనీయుఁడు దైవసమానుఁడుగా నెన్నఁబడుఁగదా.

ముకు:— మిత్రమా ! చాలుంజాలు. నన్నంతగానుతింపననవసరము.

చంద్ర:— (ముకుందునవలోకించి) కుమారా ముకుందా ! నీవొనరించిన యుపకృతి కేనేమిప్రత్యుపకారం బొనరింపఁ గలవాఁడను.

ముకు:— క్ష్మాపాలచంద్రా ! తామిట్లనుట యుచితముగాదని తెలుపుటకెంతయు నోరాడకున్నది.

జయ:— నాన్నగారూ ! చెప్పమఱచితిని. నేనీముకుందునితో నుద్యానవన విహారాభిలాషినై వెడలితిని.

చంద్ర:— తరువాత ?

జయ:— తరువాతనో జనకా ! విధివశంబున మేమిరువురము విడిపోతిమి. ఇంతలో విజయసేనుని మందిరమున స్వయంవరమహోత్సవము జరుగబోవునని వినవచ్చుటచే నేనటకేగితిని.

చంద్రవ:— నాయనా కుమారా ! అనంతరమేమిజరిగె ?

జయ:— జనయిత్రీ ! స్వయంవర మందిరమున నీసుందరి నన్ను నవ్వరించినకతంబున నేనొన్ని దినంబులు కాంచనపురంబున నుండనయ్యె.

చంద్రి:— తరువాత! తరువాత!

జయ:— తరువాత నో భూవరా! విజయసేనుఁడు చందనాపురంబు పైఁ దండెత్తనున్నవాఁడని వినుటచే బిరాన నచ్చోటు వాసితిని.

చంద్రి:— ఎవరిముఖంబున?

జయ:— మీకోడలగు రత్నపుత్రికవలన నాయుదంతంబాతయు నె ఱింగి నాసాధ్వీమణియు నేనును నడిరేయి బయనమయి వ చ్చినారము.

చంద్రి:— (రత్నపుత్రికనవలోకించి) అమ్మా! నీపాతివ్రత్యమున కెంతయుఁ గుతూహలమందితి. (జయచంద్రు నవలోకించి) నాయనా కుమారా! తదుపరి?

జయ:— కాంచనపురంబువీడి చందనాపురాభిముఖులమై వచ్చు చుండ మార్గమధ్యంబున నెన్నియో బన్నములకులోనయి జగదీశ్వరుని కరుణాకటాక్ష వీక్షణంబుల నీపురబుం జేరు కొంటిమి.

చంద్రి:— జయచంద్రా! మార్గమధ్యంబునఁబడిన నిడుమల విన మానసము తత్తరపడుచున్నయది.

జయ:— నాన్నగారూ! నాకునుడువ నోరాడకున్నది. నామిత్రుఁ డగు ముకుందునినడిగి తెలిసికొనఁ బ్రార్థితులు.

చంద్రి:— ముకుందా! మార్గమధ్యంబున నందినబన్నంబు లెవ్వి యో వినఁగుతూహలమానసుండనై యున్నవాఁడ.

ముకు:— క్షోణీతలేంద్రా! నాకావెనుండియుఁ దెలియదుగాని, నె ఱింగినంతమట్టుకు వినిపించెద. విధివశంబున నేనును జయ చంద్రుఁడును వేరుమార్గము లవలంబించితిమని వినియేయు న్నవారు. జలముంగొని మఱల మిత్రుఁడున్నతావునకు జను దెంచి నెచ్చెలి నచ్చటగనఁజాలక చింతాక్రాంతుఁడనై వనం బులన్నియుం దిరిగితిరిగి వేసారి, తుదకొక నిర్జరారణ్యంబునం బడి గ్రీష్మమునుచుండు నవసరమున నొక కేళివనుండి మనుష్య

సంచారము వివరారయంబున నాదేశమునంజని యత్నాప్రస్తాం
చి నేర్వనక వేరొక బాటఁబట్టితి. కళ్యాణపురాధీశ్వరుని
తనయుండగు మదనాభిధానుఁడు రత్నపుత్రికన్జెఱబట్టినట్టును
జయచంద్రుని క్రమముగా జంపనున్నట్లనువిని కళ్యాణపు
రంబునఁగల కారాగారముఁజేరితి.

చంద్ర:— అకటా! ఆ యధర్మపరాయణుఁడెట్టి దుష్కృతిచేయ
బూనెను!

ముకు:— తదనంతరమో భూపాలచంద్రమా! నిరాయుధుఁడై బం
ధింపఁబడియున్న జయచంద్రునిఁ జంపనుంకించునంతలో చ
టాలున నేనట కేగి వానికరంబునఁగల కరవాలంబూడబెఱికి
కొనమాకిరువురకు సమరమయ్యె. అందునే జయమంది మద
నునిఁ గారాగృహ ప్రాప్తుంజేసితిని.

చంద్ర:— (ఆశ్చర్యముతో ముకుందునిఁ గౌగలించుకొని) మహా
త్మా! నిన్నుంగొనియాడ నాతరముగాదు.

తే॥ గీ॥ నయగుణంబుల విడనాడి • నాతనయుని
సక్రమమునను జంపనూ • హనుమనంబుఁ
గన్న నవివేకిమదనుని • గర్వమడఁచి
ప్రాణదానము నిడినావు • భవ్యచరిత!॥

( తెరలో )

ఓరోరి మదోన్మత్త! తస్కరవృత్తిన్మదీయోద్యానముఁజేరి
యందుండు దుర్ముఖుని న్గుసుమాడి యామ్రఫలంబపహరించి
సంతమాత్రమున నొకధీరుండవని మురిపమున్నగకుము. నాపే
రు వినినంతమాత్రమున ధరామండలినుండు యనన్యసామా
న్య విక్రమధురంధరులందఱును గడగడవడకుదురు. నీవననెం
తవాఁడవు భుజపరాక్రమ మంతుఁడవేని సంగ్రామరంగం
బునకుం గడంగుము, లేదేని నబలవలె నొకమూల గాజులఁ
దొడిగించుకొని పడియుండుము.

చంద్ర:— అనుంగుతనయా! వింటివిగదా విజయసేనునిదురాలాపములు.
జయ:— జనకా! వింటిని. ఇంతమాత్రమున జడియువారెవ్వరు.
చంద్ర:— కుమారా! నాకొకకోరికగలదు. నెరవేర్తువేనినుడివెద.
జయ:— యుష్మదాజ్ఞానువర్తినై యున్నవాఁడను.
చంద్ర:— జయచంద్రా! పెద్దకాలంబు రాజ్యభారంబు వహించితిని. దైవానుగ్రహంబున నిన్నుఁగంటిని. ధరాభారమువహింపఁ దగినవాఁడవైతివి. కావున నీవిఁక జాలమొనర్పక రాజ్యాభిషిక్తుఁడవుగమ్ము. విజయసేనుఁడిదే యుద్ధసన్నద్ధుఁడై యున్నవాఁడు. నేనావహరంగంబున కేగకతప్పదు. సమరరంగంబున జయాపజయంబులు దైవాధీనంబులు. నాముద్దుజెల్లింపుము. (సతినవలోకించి) దేవీ! నీవంతఃపురంబున కేగుము. త్రిజగన్మోహనుని గృపవలన మొగ్గరమున జయమందితినేని మరల మనమిరువురము గలిసికొందము. లేనిచో నిదియే కడసారి చూపనుకొనుము. పొమ్ము. (ముకుందునింగని) నృపకుమారా! జయచంద్రుని విడనాడక నిరంతరంబును మీరిరువ్వురు గలసిమెలసి యుండఁగోరెద. (అని లేవబోవును.)
జయ:— (జనకుని చేయిఁబట్టుకొని) నాన్నగారూ! అఖండ విక్రముండగు జయచంద్రుఁడు, మీతనయుండుండఁ మీకేల యీదండిచింత. అనీకమున శాత్రవున్దునుమాడి వచ్చువాఁడను. నన్నుసపవేదువాఁడ.
ముకు:— రాజేంద్రచంద్రమా! విజయసేనుని గడతేర్చుటకు మీరిరువురును నవసరములేదు. నిమేషమాత్రంబున గూల్చివచ్చెద. అనుజ్ఞనీయగోరెద.
చంద్ర:— ముకుందా! కడుసంతసించితి.
జయ:— జనకా! రణరంగంబున కేగుదమురండు.

[నిష్క్రమింతురు.] (అవనికవ్రాలును.)



## ద్వితీయ రంగము.

పరిదేశము — యుద్ధభూమి.

[ప్రవేశము — విజయసేనుఁడు, చంద్రశేఖరుఁడు
జయచంద్రుఁడు, ముకుందుఁడు.]

విజ:— ఓరీ చంద్రశేఖరా!

ఉ॥ న్యాయమటంచు నెంచితివె? • యామ్రఫలంబది యేలగొంటివిం
కీయవమానము న్ననఁగ • నెంచితివేటికి? దుర్మదాంధ! నీ
చేయెడ కేగిదాగెద వి • దేల త్వదీయపరాక్రమంబులన్
నాయెనుటన్నుతించుకొన • నమ్ముమ రేనిను దొడ్డవారిలన్॥

చంద్ర:— ఓరీ విజయసేనా! డాంబికము లెందులకు. పరాక్రమంబు లాహవరంగంబునఁ గనబరచి కీర్తిగనుము. ఇట్టియ నవసరప్రసంగములతోఁ బ్రయోజనమేమి? యుద్ధసన్నద్ధుఁడనై వేచియున్నాఁడను.

విజ:— (మందహాసముతో) ఓహో! నీవొక రణధీరుఁడవా? పో అబడితివి. రణభీరుఁడవనిన బాగుండునేమో.

చంద్ర:— ధీరుఁడనో భీరుఁడనో నిమేష మాత్రంబునఁ దెలియగలదు.

విజ:— ఓరీ చంద్రశేఖరా! తస్కరవృత్తికిఁ సిగ్గిలక, యిట్టి బీరపు పలుకులాడుటకు నోరెట్లాడెనో తెలియదయ్యె.

చంద్ర:— ఆమ్రఫలంబుగ్గొనుట చోరకృత్యంబెట్లయ్యె?

విజ:— చోరకృత్యము కాదా.

చంద్ర:— కాదు.

విజ:— నిశ్చయమేనా?

చంద్రి:— ఆఁ ! మున్మాటికి నిశ్చయమే.

విజ:— ఎందువలన ?

చంద్రి:— చోరకృత్యము కానందువలన.

విజ:— నిర్ధారణ జేయగలవా.

చంద్రి:— అసంగతి వేలు.

విజ:— మదీయోద్యానమునంగల యామ్రఫలంబున్గోనుటకై నా యనుమతి నవ్వితసితివా !

చంద్రి:— నీ వెవ్వఁడవు. దేవానుగ్రహామే వడసితిని.

విజ:— (కోపముతో) ఓరీ చంద్రశేఖరా ! చింతచచ్చినను పుల్లచావలేదను లోకోక్తి నీపట్ల సార్థకమగుచున్నది. అనన్యసామాన్య విక్రముఁడనగు నన్ను సామాన్యునిగా భావించుకొనుచుంటివి కాబోలు. నేనెంతశాంతమూనినను గర్వాతిరేకంబున మన్నుమిన్నుఁగానక మింగుల దూలనాడుచున్నాఁడవు. నీమురిప మడంగించుటకుఁ దగినవాఁడను గానని నీవు దురభిప్రాయము పడుచుంటివిగాఁబోలు. నీగర్వవిజృంభ నడంచుటకే వచ్చితి

చంద్రి:— ఓరీ విజయసేనా ! మూలనున్న ముసలమ్మను గొట్టుటయనుకొంటివి కాఁబోలు. చాలుఁజాలు. గర్వాలాపముల గట్టిపెట్టుము. నికరుఁపు బౌరుషవంతుఁడవేయయిన పక్షమున నయ్యెమున కియ్యకొని శూరత్వముం జూపుము. లేదేని చను దెంచినమార్గ మనుగమింపుము. (కత్తిఝళిపించును.)

విజ:— ఓరీ అధమాత్మా ! నోటికివచ్చినటుల కారులరవకుము. వీర పురుషుఁడవేయయిన పక్షమున లేచినవాడవురమ్ము. వృథా ప్రగల్భములతోఁ బ్రయోజనమేమి. నా బలవిక్రమాదులీవె యుఁగవు యిట్లనందర్భ ప్రలాపంబులకుం గడంగితివి.

చంద్రి:— ఓరీ అధమాధమా ! విజయసేనా !

పంచ॥ బలంబుజూపుమిప్డ యనిన్వ • వాదమేలుడింభకా !

ఇలన్బడన్గదర శిరంబు ♦ నిప్పుహాల్తుగాచుకో.

విజ:— (మందహాసముతో) ఓరోరి చంద్రశేఖరా!

బలే! యనీకమున్దురాత్మ! ♦ పారిపోక నిల్చినన్ ॥
బలంబు మెచ్చుకొందుఁగాని ♦ పల్కులేటికిక్రియన్ ॥

చంద్ర:— ఓరీ విజయసేనా! నీవేకాదు. నినుఁబోలు భీరులెందఱు యిననేమి. బలహీనులఁ బడఁగొట్టి నంతమాత్రమున నొక శూరశిఖామణి నని యనుకొను టనుచితము.

విజ:— (కోపముతో) ఓహో! నీవలెనే పిఱికిపంద ననుకొంటివి కాఁబోలు. లేనిచో దస్కరవృత్తి య నుకొంటివా.

చంద్ర:— ఇట్లనుకొనుటలేదు. మగంటిమిజూపి, నందనంబునన్గల దుర్ముఖుని రణంబున మడియించి ఫలంబుంగొంటిని.

విజ:— ఓహో! దుర్ముఖుని న్బడఁగొట్టి నంతమాత్రమున నొక శూరుఁడవగుదువా.

చంద్ర:— నిన్నంత మెచ్చించిన యనంతరమా బిరుదము వహించెద. యుద్ధసన్నద్ధుఁడనై యున్నవాఁడను. రమ్ము. బలాబలంబు లరసికొందము.

విజ:— (కోపముతో కత్తిద్రిప్పుచు) ఓరీ మదోన్మత్తా! ఇదిగో! చనుదెంచితి. సంగ్రామమునకుం గడంగుము. (అని నరకఁ బోవును.)

చంద్ర:— (తప్పించుకొని) ఓరీ విజయసేనా! నీవేటిమయినది. తొలుదొలనే నుడివితినిగదా.

విజ:— (కోపముతో) అంతమాత్రమునకే మురిపమందుచుంటివిగా ఇదిగో! ఈవేటున్గాచికొమ్ము. (అని నరుకబోవును.)

జయ:—

శా॥ మామా! చాలునుజాలు డాంబి ♦ కములన్మాచెంగటన్దెల్పి, నీ
వేమో శూరుఁడవంచు నెంచితివి ♦ రసిమ్మా ఘోరసంగ్రామము

ప్రల్లగనేతు; నాజనకుని ♦ నోర్వక నవ్వధింపనవ్వడిన్
గన్దలపాసి చేరితివిసీ ! ♦ యిప్పట్లని జ్జేరుమా॥

ఉ॥ బాలుఁడవీవు, యీక్రియను బల్కఁగ ♦ బాడియె, చాలుఁజాలునీ
బేలతనంపుచేష్టలను, బేర్కొనఁ ♦ బాడియె, నవ్విపోదురిం
కేల వృథాప్రలాపములి ♦ కేగుము వచ్చినబాటబట్టినా
మ్రోల నిమేషమాత్రము పి ♦ మోదము మీరఁగనిల్తువేనిభూ
పాలురుమెచ్చనాజిని గ ♦ పాలము బ్రద్దలుగాఁగఁజేసెదన్॥

జయ:— (కోపముతో) మామా ! ఇంతదనుక నెట్టెటో కాలము
గడిపితి నీకఁ దాళఁజాల.

శా॥ పాతాళంబును జేరిడాగెదవొ ♦ బ్రహ్మాండంబున న్దాచ్చెదో
భూతప్రేతపిశాచ రాక్షసుల ♦ దాపుఞ్జేరగా బోయెదో
ధాతన్గా ప్రమటంచు వేడుకొన పోం ♦ తన్దాగినన్గానివ్రి
ఖ్యాతిన్గాన్న మహాస్త్రముం న్జానిపి ♦ సంగ్రామంబు సన్గూల్చెదన్॥

(అని అస్త్రసంధానము న్జేయును.)

విజ:— ఓరీ జయచంద్రా! ఈయస్త్రంబునన్గూలక దప్పించుకొంటి
వేని, నిగ్నున్గానిథ్యాడెదగాని డాంబికంబులతో నవసరమేమి?
(బాణము విడుచును.)

జయ:— (బాణము నడుమనె ఖండించి) ఓరీవిజయసేనా ! నీయస్త్ర
మేమైనధి. (అని బాణము వీడుచును.)

విజ:— (కోపముతో)—॥కవిరాజవిరాజితము॥—

వరివరిభంగులఁ గూసెదవేటికి ♦ బాలుడవంచుదలంచితినీ

నరికి, మీకనినున్న సంజాలను • శాతశరంబుల
ధరణిని గూల్చెద, దర్పమడంచెద! • ధాంబిక యీల్
శరణముగోరుము, చంపక వీడెద సం • గరరంగమునన్ ॥

౯॥

ముకు:— —•కవిరాజ విరాజితము•—

కదలక నిల్చెద వేని మేమును • కాలుపురంబున కంపెదరా
మదమడగించెద, దుష్టనిశాచర • మ్రింగగఁజేసెద నీక్షణమే
కదనమునన్ నను గెల్వగఁజాలవు • కానియు మేమి వశిజ్ఞను సుమా
పదెపదె దెల్పితి గావున నీదగు • ప్రాణము గాచుకొ వీడెద నే॥

విజ:— (మండిపడుచు) ఓరీ దుర్మదాంధ! ఈ శస్త్రంబున నీప్రాణంబులఁగొనెద. (అని నాగాస్త్రమును విడుచును.)
ముకు:— (దానిని నడుమనే గరుడాస్త్ర ప్రయోగంబున నిల్పి) ఓరీ దుష్టహృదయా! నీనాగాస్త్రమేమైనది.
విజ:— (తనలో, వీడు వయస్సున పిన్నవాడయ్యు, మొగ్గరమున గట్టిదిట్టరివలె నగుపడుచున్నవాడు. (ప్రకాశముగా) ఓరీ యీబ్రహ్మాస్త్రంబెట్లు వచ్చుచున్నదో జూడుము. (విడుచును)
ముకు:— (తనలో) అద్దిరే! ఈవిజయసేనుని సామాన్యునివలె నెంచితినిగాని యింతటివాడని తలపనైతి. ఈబ్రహ్మాస్త్రప్రయోగంబున కేనేమి చేయనగును. (ఇంచుక నాలోచించి) సరే. (ప్రకాశముగా) ఓరీ విజయసేనా! నీకు కాలమాసన్నమయ్యె. ఇక నెచ్చోటఁ దాగెదవు. (అని నారాయణాస్త్రమభిమంత్రించి విడువ రెండును కొంతవడిపోరాడి వమ్మైపోవును.)
విజ:— (అబ్బురపాటుతో తనలో) వీరుమడయావారుగారు. వీరిని రణరంగంబున జయించుటకల్ల. ఇక సంధిజేసికొనుటయే యుత్తమము. (ప్రకాశముగా) ఓయీ జయచంద్రా! మీవిక్రి

లకే నెంతయు నంతసించితి. సమరసూావుచేయుము.
్యమునకు బట్టాభిషిక్తు జేసెద.
త్రము.
వగారూ! నాదోసంబుల మన్నింపనగు.
బావగారూ! విధివశంబునకు మనమేమి చేయఁగలము.
జడ:— ఓయీ జయచంద్రా! రమ్ము. (దరిజేరును)
చంద్ర:— బావగారూ! పోవుదమూ!

(అందరూ నిష్క్రమింతురు.)



—పట్టాభిషేక మహోత్సవము.—



[ ప్ర—చంద, విజ, జయ, ముకు, మొదలగువారు ]

విజ:— ఓయీ జయచంద్రా! ఈసింహాసన మలంక రింపుము.
(చూపును.)
జయ:— చిత్తము. (కూర్చొనును.)
విజ:— (జయచంద్రుని శిరంబున మకుటముంచును)

(దుందుభులుమ్రోగును. భూసురులాశీర్వదింతురు.)

మంగళము.

సర్వమునంపూర్ణము.

